Regd. No. 2327.

శ్రీః

# శ్రీ వేదాంతదీపిక.

(శ్రీ వైష్ణవ సిద్ధాంత సభా పత్త్రిక.)

సంపుట ౧. ] విభవ సంవత్సరము:—ఆషాఢమాసము [సంచిక. ౮



సంపాదకులు:—వంగీపురము శ్రీ వాసుదేవాచార్యులు. బి. ఎ; యల్. టి.

శ్రీః

# విషయసూచిక.

పుటలు



---

శ్రీః

# వేదాంతదీపిక.

సంపాదకులు:— వంగిపురము శ్రీ. వాసుదేవాచార్యులు. బి. ఏ; ఎల్. టి.

సంపుటము ౧ ] విభవ సంవత్సరము ఆషాఢమాసము [సంచిక ౮

త్రిభువనకమనం తమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే।
వపురలకకులావృతాననాబ్జే విజయసఖే రతిరస్తు మేఽనవద్యా.

---

శ్రీః

## శాస్త్రమును—దాని ప్రామాణ్యమును.

(పూర్వసంచికానుబంధము.)

శ్రీ ఉభయ, తోట్టాలం వేణుగోపాలాచార్యస్వాములవారు, వేదాంతశిరోమణి, మైలాపూరు.

### భగవద్గీతయును,-మీమాంసాసూత్రములును.

ఈప్రకారమే భగవద్గీతయును పూర్వోత్తర మీమాంసాసూత్రములును, వేదార్థమును విశదీకరించుపాంటె ప్రవృత్తించియుండుటవలన వానికి గూడస్మృతులనియే పేరు. ఆకారణము వలననే "స్మరంతిచ" "స్మృతేశ్చ" యను మీమాంసాసూత్రములను శ్రీభాష్యకారులు వివరించునపుడు భగవద్గీతనే యుదహరించి యున్నారు, ఇట్లే శిక్ష, వ్యాకరణము, మున్నగునవియును, వేదార్థనిర్ణయోపకారకము లగుటవలన స్మృతులయందే యంతర్భూతములు. అయినను వీనియుపయోగవిశేషమును ననుసరించి వీనిలోఁ గొన్నింటి కంగములనియును దక్కుంగలవాని కుపాంగములనియును, వ్యవహరించుచుండుట కలదు.

ఇట్లు నిరూపింపఁబడిన శ్రుతిస్మృతులలో శ్రుతి, సాక్షాద్భగవదాజ్ఞా రూపమనియును, స్మృతి యుశ్రుతిని ననుసరించియుండుటవలన అదియు భగవదాజ్ఞారూపమనియును 'శ్రుతిస్స్మృతిర్మమైవాజ్ఞా' అనెడివాక్యముచే భగవంతుఁ డనుగ్రహించి యున్నాఁడు. బ్రాహ్మణమంత్రార్థవాదరూపముగానుండు

వేదము లనేకస్థలములలో సంకీర్ణముగాను కొన్నితావులలో నుత్సన్నము (లోపించినది) గాను ఉండుటం బట్టి అవి దుర్బోధములనితలంచి మందమతులైన మనల ననుగ్రహించుటకొఱకె మన్వాదిమహర్షి పుంగవులా శ్రుత్యర్థముల స్మృతిపురాణేతిహాసాదులమూలానఁ బ్రకాశింపఁజేసియున్నారు. శ్రుతులలోఁ జెప్ప బడియుండు కొన్నియర్థము లిప్పటి శ్రుతిలో లుప్తమై యుండవచ్చును. అట్లు లుప్తమై యుండిన ను, ఆస్మృతికర్తలు లుప్తముగానుండు వేదభాగములఁజూచి తెలిసికొని, స్మృతిమూలాన నుపదేశించి యున్నారు; అని మే మనుమానించు చున్నారము. ఇట్లనుమానింపవలయుననుటను, ఆపస్తంబులు

" తేషాముత్సన్నాః పాఠాః ప్రయోగాదనుమీయంతే "

అని. వివరించియున్నారు. శ్రుతియందును, స్మృతులయందునుఁ జెప్పఁబడని కొన్నివిషయములు శిష్టులయొక్క యాచారమే యాధారముగాఁ గని గ్రహింపఁదగినవని యెఱుంగునది. ఇది

" యథా తే తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః "

" యాన్యస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని "

అనునట్టి శ్రుతివాక్యమువలనఁ బ్రసిద్ధమే. ఎక్కడనైనను స్మృతి శ్రుతులకు పరస్పరము విరోధము కలుగునేని, ఆస్మృతికి మూలభూతమగు నొకశ్రుతి యుండవలయు ననియనుమానింపవచ్చును. అట్లగుట వలన నట్లనుమానింపఁబడిన శ్రుత్యర్థమునకును, ప్రత్యక్షశ్రుత్యర్థమునకును, అనుష్ఠానమున వికల్పమని కొందఱు మీమాంసకులు వచించెదరు. మఱియుఁ గొందఱు స్మృతికంటె శ్రుతికి నధికబలము కలుగుటంజేసి స్మృత్యర్థమునకు బాధ కలదనుట యంగీకరింపవలయునని చెప్పెదరు. తత్త్వవిషయమున విరోధముండునేని, బాధ యంగీకరింపఁబడవలయును. అయినఁ బెక్కుచోటులలో శ్రుతిస్మృతులకు నొద్దిక యుండుటవలనను, వైదికులెల్లరును స్మృతిఁ బ్రమాణముగాఁ బరిగ్రహించియుండుటవలనను, ఆ స్మృతికి నాధారముగానుండు శ్రుతిని అనుమానించుటయే యుచితమగును.

## బౌద్ధాదులయొక్క స్మృతికి అప్రామాణ్యము.

బౌద్ధాదులయొక్క స్మృతులలో సత్యవచనము భూతదయ మున్నగుకొన్నియంశములు వేదమున ననుసరించి యుండినను, అనేకస్థలములలోఁ బ్రత్యక్షశ్రుతికి నాస్మృతులు విరుద్ధములుగా నుండుటవలనను, ఆస్మృతులయందు వేదము ప్రమాణముకాదని మందలించియుండుటవలనను, ప్రామాణికులు ఆస్మృతులకు లుప్తములగు వేదభాగములను అనుమానింపకయే యాస్మృతులన్నిటినిఁ బరిగ్రహింపఁదగినవి కావని నిర్ణయించియున్నారు. కాఁబట్టి అవియు స్మృతులే యనెడికారణమువలన వానికిఁ బ్రామాణ్యము కలదని చెప్పుటయసంగతము.

## "స్మృతులకుఁ బరస్పరవిరోధనిర్ణయము"

సామాన్యముగా, 'మన్వర్థవిపరీతాతు యా స్మృతిః సా న శస్యతే' యని మనుస్మృతియే ప్రబలమనియును, మనుస్మృతికినిఁ దక్కుంగలస్మృతులకును, విరోధమేచోటనైనఁగలదేని, తక్కిన స్మృతుల నాద రింపనక్కఱలేదనియును మీమాంసకులు నిర్ణయించి యున్నారు. మానవముకంటె వేఱైనస్మృతులకుఁ బరస్పరము సంభవించునేని, వైదికపరిగ్రహము లేని కధికముగా విరోధముగలదో అదే అధిక

ప్రామాణ్యము కలదిగా నెఱుఁగునది. లక్కిన వానిని దానికనుగుణముగా నర్థముచేసియైనఁడె, వేఱు తాత్పర్యమునైనను కల్పించియైనఁడె గ్రహింపవలయును. శ్రౌతస్మృతులకు విరోధముకలుగునేని, యజ్ఞాను ష్ఠానకాలమున శ్రౌతస్మృతులే ప్రబలమగును. కాలనిర్ణయవిషయమున జ్యోతిషమే ప్రబలము. ఇట్లు సందర్భానుగుణముగా, అధికృతములు ప్రబలమనియును, అనధికృతములు దుర్బలమనియును, తెలిసికొనునది.

## వేదమునకును, పాంచరాత్రమునకును, వికల్పము.

వేదమునకును, పాంచరాత్రమునకును, ఏపట్టుననైన విరోధముకలదని పైనఁ జేర్కొనఁబడిన న్యాయముచొప్పున శ్రుతికిఁ బ్రాబల్యమును, పాంచరాత్రమునకు దౌర్బల్యమును, చెప్పుట యుచితము కాదు. అయిన దేశకాలాధికార్యవస్థల యొక్క భేదమవలంబించి పాంచరాత్రమునకు వికల్పమే చెప్ప వలయును. ఏలయనిన? పాంచరాత్రమునకు నేలాటిదోషసంబంధము లేదు కదా! కావున పాంచ రాత్రము వేదమునకుఁ దుల్యమే. వేదమునందుఁ బూర్వోత్తరవిరోధము కలిగినప్పుడు, విషయవ్యవస్థ చేయునట్లే, పాంచరాత్ర వేదములకుఁ బరస్పరవిరోధము కలుగునపుడు విషయవ్యవస్థ చెప్పవలయునే కాని వేదమువలనఁ బాంచరాత్రము బాధితమగునని చెప్పవీలులేదు. వేదములో ఒకప్పుడు పురుష సంబంధము లేమిచే, వక్కాణించువారి సంబంధమువలన రాఁదగినదోషము అణుమాత్రమైన ఏలాగు లేదో, అట్లే పాంచరాత్రమునకును వక్తృసంబంధముచే కలిగెడు దోషమొక్కటియు లేదు. ఏలయన, వేదమును అపౌరుషేయమని ఒప్పుకొన్నట్లు పాంచరాత్రమును అపౌరుషేయమని యంగీకరింప కున్నను తక్కినస్మృతులవలె ఈ సంహితలును, కర్మవశ్యులైన పురుషులచే చేయబడినవికావు. మఱి, అవాప్త సమస్తకాముడును, సర్వజ్ఞుడును, సత్యసంకల్పుడును, పరమకారుణికుడును, అయిన నారా యణునిచేత కేవలము మనవంటివారియెడ పరమకృపచే ప్రవర్తింపచేయబడినవి. గనుక మహాపురుషసం బంధమునుపట్టి పౌరుషేయములైనను, ఒక్కవిధమునను దోషగంధము లేదను కారణమువలన యివి వేదతుల్య మనఁదగి యున్నవి. వేదమెట్లు ప్రతికల్పమందును మునుపున్నరీతిలోనే ప్రత్యక్షీకరింపఁ బడి మునుపటియానుపూర్వీయుక్తముగానే ఉపదేశింపఁ బడుచున్నదో, ఆలాగే ప్రతికల్పమందును అనాదిగా ఉపదేశింపఁబడుచు వచ్చుచున్న పాంచరాత్రము ఒక్కొక్కకల్పారంభమందును, మున్నున్న విషయములను సాక్షాత్కరించి భగవంతుడు స్వతంత్రమైన ఆనుపూర్విలో ఉపదేశించుచున్నాఁడు. ఈరెంటికిని పరమపురుషునిచే నుపదేశింపఁబడుట అనునది సమానమైనను ఒక్కట ఆనుపూర్విలో నంతరమైన మార్పులేదనుటయు, మఱియొక్కటనుపూర్వీమాఱుచున్నదనుటయు భేదిల్లుటకుకారణము. కావున ఈశ్వరుని కృపామూలకముగ ప్రవర్తిల్లినది గనుక దీనికి మన్వాదిస్మృతులకన్న బహువిధముల గౌరవ మధికమైనదే.

## బ్రహ్మసూత్రములోను, పాంచరాత్రప్రామాణ్యమే యున్నది.

ఈకారణముం బట్టియే బ్రహ్మసూత్రములో రెండవఅధ్యాయము రెండవభాగములో సాంఖ్యము. యోగము, బౌద్ధము, జైనము మున్నగు మతముల దూషించి తంత్రమను పేరుచే పిలువ బడుటవలన పాంచరాత్ర తంత్రమును సాంఖ్యాదితంత్రమువలెనే అప్రమాణమని తలఁచుమందబుద్ధులు

కొందఱిభ్రమమును తొలగింప ‘ఉత్పత్త్యసంభవాత్’ అను మొదలగుసూత్రములచే పాంచరాత్రమునకు సర్వతోముఖమైన ప్రామాణ్యమును సూత్రకారులు స్థాపించియున్నారు. ప్రామాణ్యమును సాధింపవలయునను ఉద్దేశముతోనే ఆపాదములో పాశుపతాధికరణమునకు పరమతముల నిరసించి అపాదాంతమున పాంచరాత్రమునుగుఱించి విచారించిరి. ఇతరమతముల కప్రామాణ్యసాధనమునకై ప్రవర్తించిన పాదములో పాంచరాత్రప్రామాణ్యసాధనము పొసగదేయన్న, ఎట్లు ఇతరమతముల యప్రామాణ్యము సాధింపబడుచున్నదో అట్లే పాంచరాత్రాధికరణముందును, ఇతరమతముల యప్రామాణ్యమే సాధింపంబడుటవలన ఎటువంటివిరోధమును లేదు. అనఁగా, ఎట్లు సాంఖ్య యోగ బౌద్ధ పాశుపతమతముల ప్రామాణ్యము ఇటు పరులకభిమతము గనుక దాని నిరసింపవలసినదాయెనో, అట్లే పాంచరాత్రమునకును తంత్రాంతరములకు సమానముగ అప్రామాణ్యము పరాభిమతము గనుక దాని నిరాకరించిరి, అని ఒక్కరీతిగానే సర్వత్ర పరమతనిరాకరణమే పాదార్థమనుటలో ఏదోషమును లేదు. అయితే వేదవిరుద్ధతంత్రములకు అప్రామాణ్యమును చెప్పవచ్చినపాదములో ఆమూలాగ్రము సాంఖ్యము మొదలగు తంత్రము లప్రమాణమని చెప్పుచువచ్చునపుడు అందులోచేరిన ఒక్కపాంచరాత్రాధికరణములో మాత్రము పాంచరాత్రము ప్రమాణమని చెప్పవచ్చునా? మతాంతరస్థులును ఈఅధికరణమును పాంచరాత్రాప్రామాణ్యపరముగానే యోజించియున్నారే, అన అది సూత్రకారాభిప్రాయ విరుద్ధమైనది. ఈ సూత్రకారాభిప్రాయమును బాగుగపరిశీలించినచో పాంచరాత్రము ప్రమాణమనుటకే యీ యధికరణము ప్రవర్తించెననుట మిక్కిలి తెల్లమగును. పరులు ఆలాగు వ్యాఖ్యానముచేయుట వారి యభిప్రాయము లెస్సగా తెలియమిచేతనే. అది యేలాగనిన—దానిని నిరూపించెదము:

సూత్రకారాభిప్రాయమును మహాభారతానుసారముగ చెప్పవలెను.

> “ కృష్ణద్వైపాయనం వ్యాసంవిద్ధి నారాయణం ప్రభుం।
> కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారత కృద్భవేత్॥ ”
>
> “ ద్వీపేబదరికామిశ్రే బాదరాయణమచ్యుతం,
> పరాశరాత్సత్యవతీ పుత్రం లేభే పరంతప॥ ”

అనియు “ పారాశర్యవచస్సుధాం ” అనియు మొదలగువానిచే బాదరాయణ ద్వైపాయన పారాశర్య మొదలగు పదములచే పిలువఁబడు శ్రీవేదవ్యాసులే బ్రహ్మసూత్రకర్తయనియు వారే మహాభారత కర్తయనియు అందఱును అంగీకరించిన విషయము. అట్లు “ మహత్త్వాద్భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే ” అని యందు చెప్పఁబడినవిషయముల గౌరవముచేత మహాభారతమనియు, సర్వవిధముల చేతను వేదవిరుద్ధములు లేమింజేసి ‘ భారతఃపంచమో వేదః ’ అని యైదవవేదముగాను శ్లాఘింపబడు మహాభారతములో శాంతిపర్వములో 342 వ అధ్యాయము మొదలుకొని 348 వ అధ్యాయముదాక శ్రీ పాంచరాత్రమునకు సర్వతోముఖమైన ప్రామాణ్యమును తెల్లముగ నిరూపించి పాంచరాత్రమునకు ‘ ఆశ్రయదోషములేమి’ అదిప్రవర్తిల్లిన దేశవైలక్షణము, కాలవైలక్షణ్యము, ప్రవర్తకుడు, వక్త, శ్రోత, ప్రబంధము, చెప్పినవిషయములు, దాని అనుష్ఠించువారు, దానిఫలము, ఫలదాతయగుదేవత, వీని

వైలక్షణ్యము అనువానిని గైకొని సర్వతోముఖమైన గౌరవమును, వేదతుల్యత్వమును, యించుకయు వేదవిరోధములేదనుటను బాగుగానిరూపించి యున్నారు. దాని సంగ్రహము ఇట్లు:—

పంచరాత్రము పరమసిద్ధికి సాధనము.

శాంతిపర్వము—342 వ అధ్యాయము మొదట "గృహస్థో బ్రహ్మచారీచ వానప్రస్థోథ భిక్షుకః। యఇచ్ఛేత్సిద్ధి మాస్థాతుం దేవతాంకాం యజేతసః" శాంతి 342—1, అని సత్యాధికులైనయుధిష్ఠిరుడు నాలుగుఆశ్రమస్థులను మోక్షమువడయ ఎద్దేవతనాశ్రయింపవలెను అనియు ఏ విధమున నాశ్రయింపవలయును అనియు సామాన్యముగ ప్రశ్నింప. సకలవేదరహస్యములను చక్కగ నెఱిగిన శ్రీభీష్ముడు, పాంచరాత్రమున పేర్కొనఁబడు పరమైకాంతిధర్మమును తన్ను ఈతడు అడిగాడు అని చిత్తగించి,

గూఢంచ మాం ప్రశ్న మిత్యప్రశ్నం పృచ్ఛసేత్వమిహానఘ। నహ్యేతత్తర్కయా శక్యం వక్తుం వర్షశతైరపి। గహనం హ్యేతదాఖ్యానం వ్యాఖ్యాతవ్యంతవారిహన్॥ శాంతి 342—5 అని ఈవిషయము మిక్కిలి రహస్యమనియు యుక్తికలన తెలియదగినది కాదనియు కొనియాడి విషయమును విస్తరించిచెప్పఁదలచి ఉపరిచరవసువుయొక్క ఉపాఖ్యానమును ఆరంభించి చెప్ప మొదలుపెట్టి

అవాచ్యమేత ద్వక్తవ్య మాత్మగుహ్యం సనాతనం। తవభక్తిమతో బ్రహ్మన్ వక్ష్యామితు యథాతథం॥ 342—29 అని అయోగ్యుల కీవిషయము చెప్పఁదగనిదనియు చెప్పి

తత్రప్రశాసతో రాజ్యం ధర్మేణామిత్రఘాతినః। నానృతా వా క్సముత్పన్నా మనోదుష్టం చనాభవత్॥ సంస్థితేషున్రుపేతస్మిన్ శాస్త్రమేతత్సనాతనం। అంతర్ధాస్యతి తత్సత్యం ఏతద్వఃకథితంమయా॥ 342— 27 అని ధార్మికజనులు నిండియున్నకాలముననే యీధర్మమునకు ప్రవృత్తి యనియు, తక్కినసమయములో దీనికి క్షీణతయనియు., ఇట్లు కాలవిశేషములలో ఆవిర్భావతిరోభావము లుగ్గడించుటవలన వేదార్థమువలె ఈపాంచరాత్రార్థమును, అనాదియని యొజింగించి;

వేదైశ్చతుర్భిస్సమితం కృతం మేరౌమహాగిరౌ। 349—29 అని లోకమర్యాదను స్థాపించు మునులు నిండియుండు మేరుపర్వతమున పరగినదగుటచేదునిదిపరగిన దేశమునుబట్టియు దీనికి వైలక్షణ్యమును నిరూపించి,

ఏకాగ్రమనసోదాంతామునయ స్సంయమేరతాః। 343—31 అని దీనికి ప్రవర్తకులైన ఋషులశమదమాదిగుణమునుచెప్పి,

దివ్యంవర్షసహస్రం వైసర్వతోమున యస్తపః। 343-35 అనుటచే వారి తపోమహిమయు,

నారాయణానుశిష్టాహి తదా దేవీసరస్వతీ। వివేశ తాన్రుషీన్ సర్వాన్ లోకానాం హితకామ్యయా॥343—36 అనుటచే వారికి సరస్వతీప్రాప్తి భగవదనుగ్రహముచేతననియు అదియు లోకహితార్థమనియు

సర్వే ప్రమాణంహి తథా యథైతచ్ఛాస్త్రముత్తమం॥ 343—44 అనుటవలన ఇతరప్రబంధ ప్రామాణ్యములలో నిది దృష్టాంతభూతమని యు,

భవిష్యతి ప్రమాణం వై ఏతన్మదనుశాసనం 343—45 అనుటచే సాక్షాద్భగవదాజ్ఞారూపమనియు,

అస్మాత్ప్రవక్ష్యతే ధర్మాన్ మనుస్స్వాయంభువస్స్వయం। 343—45 అనుటచే మన్వాదుల కును ఇది యుపజీవ్యమనియు చెప్పి.

ఉశనా బృహస్పతిశ్చైవ యదోత్పన్నౌ భవిష్యతః॥ తదా ప్రవక్ష్యతః శాస్త్రం యుష్మన్మతిభిరుద్ధృతం 343—46 అనియు,

యుష్మత్కృతమిదం శాస్త్రం ప్రజాపాలో వసుస్తతః। బృహస్పతేస్సకాశాద్వై ప్రాప్స్యతే ద్విజసత్తమాః॥343—48 అనియు, ఉత్కృష్ట దేవర్షి పరిగ్రహమును ఉత్కృష్టశిష్యసంబంధమును చెప్పి,

ఇదం శ్రేయ ఇదం బ్రహ్మ ఇదం హితమనుత్తమం। తత్రధర్మార్థ కామా హి మోక్షః పశ్చాచ్చకీర్తితః॥ 343—34 అనుటవలన "ప్రత్యయార్థం తు లోకస్య" అనునట్లు ముందు త్రివర్గప్రతిపాదకమై పిదప మోక్షప్రతిపాదకమనియు, పరమహితమనియు, సర్వవేదాంతరహస్యమనియు, నడివి ఇట్టి పాంచరాత్రనిష్ఠగల ఉపరిచరవసువు,

తస్య యజ్ఞో మహానాసీ దశ్వమేధో మహాత్మనః 344—5 అని అశ్వమేధము చేసినట్లు చెప్పుటవలన ఒకయధికారికే వైదికకర్మములయందును పాంచరాత్రకర్మములందును సమానాధికారము కలుగవచ్చునని తెలిపెను. మీద,

ప్రీతస్తస్యో స్య భగవాన్ దేవదేవః పురాతనః। సాక్షాత్తం దర్శయామాస సోఽదృశ్యోఽన్యేన కేనచిత్॥ 344—12 అనుటవలన వైదికకర్మములందును పాంచరాత్రకర్మములందును సాక్షాద్భగవంతుడే ఆరాధ్యదేవతయనియు,

అదృశ్యేనహృతో భాగో దేవేన హరిమేధసా 344—18 అని సర్వదేవతలను చూడ వలంతియగు బృహస్పతికిని భగవంతుడు ప్రత్యక్షముకాక ఉపరిచరవసువు చూపునకు గోచరుడయ్యెనని చెప్పఁబడియె. మఱియు, భగవంతుడు దర్శనమియ్యలేదని బృహస్పతి యలుకపూన, ఏకతుడు మొదలగువారు అతనికి బదులుచెప్పు క్రమమువలన ఎవ్వనియెడ భగవంతున కనుగ్రహము జనింపఁగలదో అతనికే భగవద్దర్శనము సాధ్యమని,

నశక్యస్సత్వయా ద్రష్టుమస్మాభిర్వా బృహస్పతే। యస్య ప్రసాదం కురుతే సవైతం ద్రష్టుమర్హతి, 344—25 దీనిచే చెప్పి యిందుచేత తక్కినయధికారులకంటె భగవద్ధర్మనిష్ఠుఁడు ఉత్తమాధికారియని చెప్పఁబడెను. ఒకప్పుడు వారు భగవంతుని సాక్షాత్కరింప నెంచి ఉత్తరదిక్కుచేరి బహుకాలము తపముచేసినపిదప ఒక్కయాకాశవాణి తోతెంచి మీరు "క్షీరసముద్రమున కుత్తరముగా శ్వేతద్వీపమునకేతెంచిన అచ్చట భగవత్స్వరూపమును చూడవచ్చును," అని చెప్పునపుడు

మేరోరుత్తరభాగేతు క్షీరోదస్యానుకూలతః। సదేశో యత్ర నస్తప్తం తపః పరమదారుణం 344—28 ఏకాంతినస్తే పురుషాః శ్వేతద్వీపనివాసినః। గచ్ఛధ్వం తత్ర మునయ స్తత్రాత్మా మే ప్రకాశితః 344—34 అని భగవద్ధర్మనిష్ఠులు వసించుదేశము కేవలతపోబలముచేత లభ్యమగునని చెప్పబడియె. తర్వాత వారు శ్వేతద్వీపము చేరగా,

తతోఽస్మద్దృష్టివిషయస్తదా ప్రతిహతోఽభవత్ 314—37 అని వీరికి కన్నులుగానకపోయె ననుటచే ఇతరధర్మనిష్ఠులు భగవద్ధర్మనిష్ఠులను చూడ వలనుపడదనియు, తర్వాత వారు అచ్చట బహు కాలముతపస్సుచేయ,

వ్రతావసానేస్య శుభాన్ నరాన్ దదృశిమో వయం। 344—39 అని విశేషతపస్సుచే వారిని చూడసాధ్యమయ్యెననియు

బలిఃకిలోపహ్రియతే తస్య దేవస్య తైర్నరైః। వయంతు తేజసా తస్య సహసా హృతచేతసః॥ 344—46 అని భగవంతుఁడు స్వయముగవచ్చి వారికి దర్శనమొసగుటచే వారి మహిమయును, అస్మాన్నకశ్చిన్మనసా చక్షుషా వాప్యపూజయత్। 344—54 అనుటచే వారికి ఇతరాధికారులయెడ నుండు అనాదరభావమును చెప్పఁబడె. మీఁద, వారు అచట బహుకాలము తపముసల్పినవెనుక,

దృష్టావఃపురుషాః శ్వేతాః సర్వేంద్రియవివర్జితాః। దృష్టో భవతి దేవేశ ఏభిర్దృష్టైర్ద్విజోత్తమైః॥ 344—57 అని యాకాశవాణి యుదయించి " మీరు ఈమహాపురుషులను చూడఁగలరు అది భగవద్దర్శనముతో సమానమగును " అని చెప్పెను. ఇందుచేత వీరిదర్శనము భగవద్దర్శనమునకు సరియని చెప్పినట్లయ్యెను.

మీఁద 346 వ అధ్యాయారంభమున

ప్రాప్య శ్వేతం మహాద్వీపం నారదో భగవానృషిః। దదర్శ తానేవ నరాన్ శ్వేతాంశ్చంద్రసమప్రభాన్। పూజయామాస శిరసా మనసా తైశ్చ పూజితః॥ 346—1 అని ఒకప్పుడు నారదుడు అయ్యెడకుఁజని వారింగనుంగొని స్తుతించెననుటచే వారు దేవర్షులచేతను కొనియాడఁతగినవారనియు,

మీఁద, నహ్యేతత్ బ్రహ్మణా ప్రాప్తమీదృశం మమదర్శనం। 346—58 అని భగవంతుఁడు నారదునకు దర్శనమొసఁగునపుడు ఈరూపమును బ్రహ్మదేవుడును చూడలేదనుటచే భగవద్ధర్మనిష్ఠులు బ్రహ్మకంటె నుత్తములనియు,

ఉవాచ మధురాం భూయో గచ్ఛ నారద మాచిరం। ఏకాగ్రాశ్చింతయంతో మాం నైషాం విఘ్నో భవేదితి॥ 347—19 అనుటచే నారదునితో సంభాషణమును వారిధ్యానమునకు అడ్డంకియగు ననియు, అందుచే నారదాదులకంటె వారు భగవానునికి ఎక్కువఅంతరంగులనియు చెప్పఁబడెను. అట్లే దీనియుపసంహారమందును,

ఇదం మహోపనిషదం చతుర్వేదసమన్వితం। సాంఖ్యయోగకృతాంతేన పంచరాత్రానుశబ్దితం॥ 348—62 అని పంచరాత్రశాస్త్రము మిక్కిలి రహస్యమనియు సకలవేదసారమనియు జ్ఞానయోగ కర్మయోగములందు సమర్థులగువారు దీనిని పంచరాత్రమను నామముచే పిలుతురనియు, బహుభంగులపొగడఁబడుచున్నది. అట్లే పైనను,

అయం హి దురనుష్ఠేయో మోక్షధర్మస్సనాతనః। యం హిత్వా దేవతాస్సర్వాః హవ్యకవ్యభుజోఽభవన్॥ 349—9 అని యీపరమైకాంతిధర్మములో దేవతాంతరములకు సంబంధములేదనియు,

నూన మేకాంతిధర్మోఽయం శ్రేష్ఠోనారాయణప్రియః। ఏకాంతినోహిపురుషా గచ్ఛంతి పరమేపదం॥ 348—4 అనుటచే ఈధర్మము నారాయణునికి మిక్కిలి ప్రియమనియు దీనికి ఫలము మోక్షమనియు చెప్పఁబడియున్నది.

యద్యేకాంతిభిరాకీర్ణం జగత్స్యాత్కురునందన। భవేత్కృతయుగప్రాప్తి రాశీః కర్మ వివర్జితా॥ 359_63 అని యీయనుష్ఠమధర్మనిష్ఠులు జగమునమండినచో దానిని కృతయుగముగ భావింపవలయుననియు,

పంచరాత్రస్యకృత్స్నస్య వక్తానారాయణస్స్వయం। సర్వేషుచనృపశ్రేష్ఠ జ్ఞానేష్వేతేషు దృశ్యతే॥ యథాగమం యథాన్యాయం నిష్ఠానారాయణఃప్రభుః 359—68 అని దీనికి భగవంతుఁడే సాక్షాత్ప్రవర్తకుడనియు కడమతంత్రములను సమీచీనయుక్తులతో నాలోచించినయెడ వానికిని నారాయణునియొకలనే పర్యవసానము దృఢమనియుచెప్పి,

పంచరాత్రవిదోయేతు యథాక్రమపరానృప। ఏకాంతభావోపగతాస్తే హరింప్రవిశంతివై॥ 359—72 అనియు, ఏకాంతభావోపగతాస్తే భక్తాఃపురుషోత్తమం। తే సహసార్చిషం దేవం ప్రవిశంతిసనాతనం॥ అనియు ఈపరమైకాంతిధర్మమే సాక్షాన్మోక్షప్రదమనియు తన్మూలమైన అధికారి వైలక్షణ్యమునుచెప్పఁబడినది.

బ్రహ్మసూత్రపదైశ్చైవహేతుమద్భిర్వినిశ్చితైః। అని భగవద్గీతలో సమీచీనన్యాయములతో (యుక్తులతో) గూడినబ్రహ్మసూత్రములచేతను ఇయ్యర్థము ప్రతిష్ఠితమైయున్నదని సెలవిచ్చిన శ్రీ వేదవ్యాసులే మోక్షధర్మములో,

తత్త్వంజిజ్ఞాసమానానాం హేతుభిస్సర్వతోముఖైః। తత్త్వమేకోమహాయోగీ హరిర్నారాయణఃప్రభుః॥ 347—58 అని 'తత్త్వ'శబ్దముచేతను 'జిజ్ఞాసమాన' శబ్దముచేతను తత్త్వశబ్దము పరబ్రహ్మవాచకమగుటచేత 'అథాతోబ్రహ్మజిజ్ఞాసా' అనుచోటనుండు బ్రహ్మశబ్దమునకును, జిజ్ఞాసాశబ్దమునకును ప్రత్యభిజ్ఞకలుగుటచేతను, 'హేతుభిస్సర్వతోముఖైః' అనుటచే 'బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిః' అనునట్లు 'ఈక్షతేర్నాశబ్దం' అను మొదలు 'అనావృత్తిశ్శబ్దాత్' అను పర్యంతమున్న సూత్రములలోని పంచమ్యంతపదములకు ప్రత్యభిజ్ఞ జనించుటచేతను ఈశ్లోకముచేత 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను మొదలుకొని ప్రవృత్తమైన శారీరకశాస్త్రములో సమీచీనహేతువులనుబట్టి సాక్షాన్నారాయణుఁడే పరతత్త్వమని మేము నిర్ధారణముచేసియున్నారమని చెప్పుటచేతను, తమచే నిర్ధారణచేయఁబడిన పరమైకాంతిధర్మానుష్ఠానమునకును, తత్ప్రతిపాదకమైన పాంచరాత్రమునకును, దాని ప్రామాణ్యమునకును, బ్రహ్మసూత్రము ఇసుమంతయైన విరుద్ధముగనుండకూడదు కాబట్టి 'పాంచరాత్రప్రామాణ్యనిరాకరణమునకే పాంచరాత్రాధికరణమేర్పడినది.' అని యితరులవ్యాఖ్యానము సూత్రకారాభిప్రాయమునకు సంపూర్ణముగ విరుద్ధమైనదమట యెల్లరకుస్పష్టమే.

## సాంఖ్యాదిశాస్త్రములకు విశేషము.

మిగతసాంఖ్యాదిశాస్త్రములైతేనో భ్రమము, విప్లవము,, మొదలగు దోషసంభావన కలవారలచే చేయబడినవగుటవలన నవి వేదవిరుద్ధాంశములందప్రమాణమే. వేదవిరోధమును,—అనుష్ఠా

విషయములో విరోధమనియు, తత్త్వవిషయములో విరోధమనియు, రెండువిధములుగానుండు. వానిలో సాంఖ్యయోగపాశుపతములలో కొన్నితత్త్వవిషయములందు స్వరూపములో విరోధములేకున్నను అనుష్ఠానవిషయమునందు విరోధమధికమై యున్నది. అదేమన, సాంఖ్యులకు ప్రకృతిపురుషవివేకముచేత మోక్షము. వేదాంతులకైతేనో, భగవదుపాసనచే మోక్షము. అట్లే తత్త్వవిషయములో ఈశ్వరునకు ఉపాదానకారణత్వమంగీకరింపమి మఱియొకవిరోధము. అట్లేయోగమునందును ధ్యానమును మోక్షసాధనముగా వారంగీకరించినను ధ్యానింపఁబడువస్తువులలో జీవాత్మను బ్రహ్మాత్మకముగను, ఈశ్వరుని జగదుపాదానముగాను అంగీకరింపమిచేత అనుష్ఠానములో వైషమ్యమును, అట్లే ఆయీశ్వరుడు కేవలనిమిత్తకారణమనియే యంగీకరించుటవలన తత్త్వములో వైషమ్యమును కలదు. పాశుపతములోను కొన్నితావులలో విరోధములేనట్లు కానంబడినను ముముక్షువునకు ఉజ్జీవ్యమైన యంశమొక్కటిలేనందునను నిషిద్ధానుష్ఠానమే యెక్కువగా నుండుటచేతను పరావరతత్త్వములను వ్యత్యస్తముగ ఒప్పుకొనియుండుటవలనను బ్రహ్మమునకు ఉపాదానకారణత్వమంగీకరింపమివలనను పాశుపతమత్యంతానాదరణీయమయ్యెను. ఈయనాదరమును లోపఁజేయుటకే శారీరకమీమాంసలో సాంఖ్యయోగములను నిరాకరించినవెంటనే దీని నిరాకరణము సంగతమైయుండ దీనినటు నిరాకరింపక బౌద్ధాదిమతములను నిరాకరించినపిదప నిరాకరించెను. శైవవిశిష్టాద్వైతములో బ్రహ్మమునకు ఉపాదాననిమిత్తకారణత్వములను అంగీకరించినవారయ్యును చక్కగ పరామర్శించినచో నారాయణావస్థను పొందియున్న శివున కుపాదానత్వమును సాక్షాత్ శివునకు నిమిత్తత్వమును వారు ఒప్పుకొనియుండుటచేత వాస్తవమున వారును నిమిత్తోపాదానత్వములను ఒకచోటనే యంగీకరించెదరనుటలేదు.

"సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా। ఆత్మప్రమాణా న్యేతాని న హంతవ్యాని హేతుభిః" అని వేదపంచరాత్రములకు తుల్యముగ పాశుపతాదులను చెప్పియున్నదే యనిన, అక్కడను "యథాగమం యథాన్యాయం నిష్ఠా నారాయణః ప్రభుః" అనుటచే న్యాయపరిశీలితములగు ఆయా ఆగమములలో చెప్పబడువస్తువులకు నారాయణునియందు పర్యవసానము అని చెప్పినచొప్పున ఆయాఆగమోక్తమైన వస్తుస్వరూపమును స్వీకరించుటలో బౌద్ధాదిగ్రంథములవలె సాంఖ్యముమొదలైనవానికప్రామాణ్యము చెప్పవలదనుటలో తాత్పర్యము. వేదముతో విరోధించిన అప్రమాణమే. గనుకనే వేదవిరోధములేనిచోట్లలో కేవలయుక్తులచే నిరసింపవలదు, అని తలచి "న హంతవ్యాని హేతుభిః" అని చెప్పఁబడియున్నది.

ఈవిషయమంతయు క్రిందఁజూపఁగల శ్రీయాళవందారు సెలవిచ్చిన శ్లోకమందు సంగ్రహముగఁదెలుపఁబడి యున్నది.

ఇత్థం నానాశ్రుతిమునివచస్సంతతస్తూయమానజ్ఞానైశ్వర్యః పరమపురుషః పంచరాత్రం వ్యధత్త। తచ్చేదశ్రుతిపథపరిభ్రష్టతంత్రైస్సమానం పాత్రత్వేన ప్రసజతి తదా సోమపాత్రే సురాపాః॥

ఇందుచే, పాంచరాత్రమును తంత్రమగుటచే మిగతపాశుపతాదితంత్రములతో సమానముగనే దీని గౌరవముండవలయుననుట మిక్కిలి యసంగతమయినదె.

ఇవ్విధమున శాస్త్రముయొక్క తత్త్వమును, దానిగౌరవమును, దానిప్రామాణ్యమును దెలియునను, పూర్వాచార్యులమతములననుసరించి మితముగ వివరింపఁబడెను.

శ్రీః

శ్రీమతేరామానుజాయనమః

# అద్వైత విశిష్టాద్వైతసిద్ధాంతముల

## సంగ్రహప్రశ్నోత్తరములు.

(శ్రీ ఉభయ, కాశీ వంగిపురం విద్వాన్ రంగాచార్యస్వాములు,)

బహుకాలమునకుమునుపు, ప్రత్యక్షమొక్కటే ప్రమాణమనియు, కన్నులకు కనుపింపనది ఒక్కటియులేదనియు, పరలోకమే లేదనియు " కిణ్వాదిభ్యోమదశక్తివత్ " తములపాకు భాగాలు సున్నము ఈమూటిని ప్రత్యేకముగా నుపయోగించిన వ్యాధికలిగి, వానిని చేర్చి ఉపయోగించిన ఎఱుపును, మదమును, ఇవి మొదలైనవి కలుగునట్లే, భూమి, జలము, తేజస్సు ఈమూడును చేరిన శరీరమై దానికి మాట్లాడుశక్తి మొదలైనవి కలుగుచున్నవనియు చార్వాకులు చెప్పుచువచ్చిరి. అవి ప్రత్యేకమైపోయిన, శరీరము ఒక్కటియు లేదనుటను " భస్మీభూతస్య దేహస్య పునరాగమనంకుతః। అగ్నిహోత్రం త్రయోవేదాః త్రిదండం భస్మగుంఠనం। బుద్ధిపౌరుషహీనానాం జీవికేతిబృహస్పతిః॥ ఋణంకృత్వాఘృతంపిబ। యావజ్జీవం సుఖం జీవేత్ " అని చార్వాకమతమే వెలిపడుచు చుండెను. పిదప, " శ్రుతిఃప్రత్యక్ష మైతిహ్యమనుమానశ్చతుష్టయం " అను వేదమును తీసికొని ప్రత్యక్షము అను మానము ఆగమము మొదలైనవి సైతము ప్రమాణమనితలచి, అందులోను " నభూమి నతోయం నతేజో నవాయు నఖం నేంద్రియం వా నతేషాంసమూహః। అనైకాంతికత్వాత్సుషుప్త్యైకసిద్ధ స్తదేకోఽవశిష్టశ్శివః కేవలోఽహం॥ ఆత్మ శరీరముకాదు, ఇంద్రియములుకాదు, మనస్సునుకాదు, ప్రాణమును కాదు, అని శ్రీశంకరాచార్యులు స్థాపించి, దానినే ముక్తుడైనపిదప బ్రహ్మమని చెప్పుటయనియు' అవిషయమైన జ్ఞానమునే "అథాతోబ్రహ్మజిజ్ఞాసా" అని యారంభించి సూత్రకారులు చెప్పిరి యనియు నిశ్చయించిరి. తర్వాత ఆత్మ ఒక్కొక్కశరీరమందును వేఱైనది అని మనభాష్యకారులు, 'జీవస్తు ప్రతిశరీరం భిన్నః' అని తార్కికులును స్పష్టపఱచియున్నారు. నిత్యులై, జ్ఞానులై, ఒక్కడై కోరి కల నొసంగసమర్థుడును అయినవాడే బ్రహ్మమనియు, పరమాత్మయనియు చెప్పఁబడినట్లు. " నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా మేకోబహూనాం విదధాతికామాన్। ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి " అని పెక్కు ఉపనిషత్తులచేతను గీతచేతను తెలియఁబడినది. " దేహేంద్రియ మనః ప్రాణధీభ్యోఽన్యోనాన్యసాధనః। నిత్యోవ్యాపీప్రతిక్షేత్ర మాత్మాభిన్నస్స్వతస్సుఖీ " అని నిర్ణయించి "అథాతోబ్రహ్మజిజ్ఞాసా" అని పరమాత్మనుగుఱించియే విచారించి తెలిసికొనవలయునని సూత్రకారులు చెప్పిరి. అని భాష్యమును చేసి, పదంపడి ఉపనిషత్తులలోను ఆబ్రహ్మము- సత్ అనియు, ఆకాశ

మనియు, ఆత్మ అనియు, కాముఁడు అనియు, హిరణ్యగర్భుఁడుఅనియు పేరులచే చెప్పియుండుటవలన సందేహముపుట్ట శ్రీమంతుడైన నారాయణుఁడే బ్రహ్మశబ్దమునకు అర్థమని పెక్కు ఉపనిషత్తులచేతను, రామాయణాదులచేతను, గీతచేతను, ఎతిరిఁగి శిష్యులకు వానిని సులభముగా తెలిపియున్నారు. ఆ యర్థమును పూర్వాచార్యశ్లోకములచేత సంగ్రహముగ నుపన్యసించెద. అందు, " కస్త్వంతత్వవిదస్మి " అని యారంభించి విశిష్టాద్వైతనిగమనమును (సిద్ధాంతమును) చూపినపిదప, అద్వైతి " అన్యత్కథం" అని బహుయుక్తులచే చెప్పినదానిని " నీయతాం " అని అనేకయుక్తులచేత ఆ యద్వైతియొక్క యుక్తిని నిరాకరించి స్వమతస్థాపనము చేసినదానిని సంక్షేపముగ ఉపన్యసింప మొదలిడెదను.

" కస్త్వం తత్వవిదస్మి వస్తుపరమం కింతర్హి విష్ణుఃకథం
తత్వేదంపరతైత్తిరీయకముఖత్రయ్యంతసందర్శనాత్।
అన్యాస్తర్హి గిరః కథం గుణవశా దత్రాహరుద్రః కథం
తద్దృష్ట్యాకథ ముద్భవత్యవతర త్యన్యత్ కథం నీయతాం॥ "

అద్వైతి:—(కస్త్వం) నీవుయెవడు?

విశిష్టాద్వైతి:—[ఈప్రశ్నలో నీవు అనునది ఒకటి, యెవడు అనునది ఒకటి, అడిగినవాడు ఒక్కడు; అంతు యీమాటికిని ఇది చోటిచ్చుటవలన ఇది విశిష్టాద్వైతమని తోచుచున్నది. ఏలయన అద్వైతమతములో ఒక్కటితప్ప వేఱులేకుండుటవలన విశిష్టాద్వైతముగానే జగముండవలయునని తలచి బదులిడుచున్నాడు.] (తత్త్వవిదస్మి) బ్రహ్మమును యెఱిగినవాడను.

అద్వైతి:—తత్వమే మానిజము; దానిని "యెఱిగినాడను" అనుటలో ఎఱుక అనునది ఒకటి; నేను అనునది ఒకటి; ఈమూడును కలిసియుండుటవలన ఈపదార్థములలో ఉత్తమమైనవస్తువేది?

విశి:—సత్యమైనలోకమును జ్ఞానశక్తి మొదలైనవానిచే వ్యాపించియున్న విష్ణువనువాతడే.

అద్:—నీవు ఏకారణమువలన అలాగుచెప్పెదవు.

విశి:—" హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ "

అని లక్ష్మికిపతిగానుండువాతడు పరమకారణమని చెప్పఁబడియుండుటవలన. వేదములో 'స్త్రీలకు భర్తయొక్కడే; ఇద్దరుపతులు కూడదు. పురుషుడు ఇద్దఱు స్త్రీలను పెండ్లాడవచ్చును; అని [" తస్మాదేకస్య బహ్వ్యోజాయా భవన్తి నైకస్యై బహవస్సహపతయః " ] యజుర్వేదములో చెప్పియున్నట్లు భేదమునుకనిపింప లక్ష్మీపతి యనిచెప్పియుండుటచేతను, " తద్విష్ణోఃపరమంపదం సదా పశ్యంతిసూరయః, " నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నోవిష్ణుః ప్రచోదయాత్" "యస్యపృథివీ శరీరం; " " తద్విష్ణోః " ఇతిమంత్రతః, " తత్సర్వం వైహరేస్తనుః " " జగత్సర్వం శరీరంతే " ఇవి మొదలైనపెక్కు శ్రుతి స్మృతులవలనను సత్యమైనజగమును శరీరముగాగల విష్ణువే నిజమైనవస్తువని చెప్పబడెను.

అద్:—" కద్రుద్రాయప్రచేతసే మీఢుష్టమాయతవ్యసే " మొదలైన శ్రుతులచేతను " సర్వాసు శ్రుతిషుత్కృష్టా రుద్రైకాదశినీశ్రుతా। తత్రపంచాక్షరీ తస్యాం శివఇత్యక్షరద్వయం।

అనుటవలనను, లోకములో ఉత్తమవస్తువును ఇనుపపెట్టెనదుఅలలో పెట్టుటవలె "శివః" అనుపదమును యజుర్వేదము రుద్రప్రశ్నమునడుమ " నమశ్శివాయచ " అని చెప్పియుండుటవలన ఈశ్వరునికి గొప్ప తనము యేర్పడుచున్నదే కాని, విష్ణువునకు నీవుచెప్పునది యెట్లు సమన్వయించును? మఱియు, మీ సంప్రదాయప్రకారము మిక్కిలి ఉత్తమమైన 'వేదంతమిళ్ళ్ సెయిదమాఱన్ శఠగోపన్' అని చెప్పబడిన నమ్మాళ్వారుపాయించిన తిరువాయిమొళ్ళి ఆదిమధ్యఅంతములలో " అయర్వఱుమమరర్ కళ్ అధిపతి యెవనవన్ " అనియు నీఱుశెవ్వేయిడక్కాణిల్ నెడిమాలడియార్క్కోడుమ్ " ' అనియు ఆరిదైయ యహై యరనైయలత్తి ' అనియు పాడియుండుటవలనను, యజుర్వేదశ్రుతిలోను " ఏకఏవరుద్రో నద్వితీయాయతస్థే నమస్తేరుద్రమన్యవే, " అంబేఅంబాల్యంబికే " అని ఆదిమధ్యాంతములలో రుద్రునకే ఉత్కర్షము చెప్పియుండుటవలనను, నీయొక్క సమాధానము యెట్లుచెప్పుకొనదగును?

విశి:—రుద్రశబ్దమునకును శివశబ్దమునకును భేదవాక్యములకును నీవు క్రిందచెప్పినవిధమున అర్థము కనబడకుండుటచేతను " రుద్రోవాఏష.యదగ్నిః " అని వేదమే రుద్రశబ్దమునకు అగ్ని యని అర్థము చెప్పియుండుటవలనను, నీవు చెప్పినవేదము కర్మకాండమనియే ప్రసిద్ధమై యుండుట వలనను, నీవుచెప్పినరుద్రప్రశ్నమును కొన్నియాగములలో సోమమంత్రముగా "శతరుద్రీయంజుహోతి భాగధేయేనైవైనంశమయతి, నార్తిమార్చ్ఛతియజమానః " అని నుడివియుండుటవలనను రుద్రశబ్దమునకు అగ్నియనియే అర్థము. ఇంకను శివశబ్దమునకు " నమస్తేరుద్ర " అని యారంభించి పెక్కు నమస్కారములు ఒనర్చినతర్వాతనే అగ్ని కేవలకు కోపముచల్లారి, దానివెనుక ఏర్పడినక్షేమంకరమైన స్వభావమును పరిశీలించి తెలుపగావచ్చిన క్షేమవాహియనునదే శివశబ్దముయొక్క అర్థము.

నమ్మాళ్వార్ల గాధలయందును, " నక్కపిరాను మన్రువ్యకుండదు నారాయణనరుళే " అను తిరువాయిమొళ్ళిలో నాలవశతకము పదియవదశకమందు ఈశ్వరునికి పరతత్వశబ్దవాచ్యత్వము లేదు అనుటను, విష్ణువునకే పరతత్వశబ్దవాచ్యత్వము కలదు అనుటను బాగుగ వెల్లడించియుండుటవలన, చిట్టచివరగాధలో " అరిదైయ యయనై, యరనై, యలత్తి " అనుటయులోకములో సృష్టిస్థితి సంహారములను పంచుకొని వేర్వేఱుగ అధికారముచేయుటంబోలె ప్రకాశించుచుండుటను కని సమముగ గ్రహించి వారిని చూపి, వారికంతర్యామిగానుండు నాతడు అని ప్రదర్శింప పాడబడినదేకాని వేఱులేదు. మఱియు, ఆమ్మాగురిలో బ్రహ్మను రుద్రుని,

" కుఱైకొండు నాన్ముకన్ కుండికైనీర్పెయ్ద్
మఱైకొండ మందిరత్తాల్ వాళ్ళిత్తి—కఱైకొండ
కండత్తాన్ శెన్నిమేలేఱక్కళువినాన్
అండత్తాన్ శేవడియై యాంగు "

[వినీతుడై బ్రహ్మదేవుడు తన కమండలుజలము పోసి వైదికమంత్రములతో నుతించి కఱకంఠునిజడ ముడిపైబడునట్లు అండాధిపతి యొక్కపాదములను కడిగెను.] అనుటచే శక్కువైనవారని నిరూపించి యున్నారు.

తక్కినశ్రుతులందును కారణమును చెప్పవచ్చినచోట "యతోవా ఇమాని భూతాని జాయంతే యేనజాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతీతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" అనుటచే సృష్టిస్థితిసంహారములు మూటినికి కారణమెవడో అతడే బ్రహ్మమని చెప్పియుండుటనుబట్టి, ఈ యుపనిషత్తుశేషమైన పురుషసూక్త ఉత్తరనారాయణానువాకములోను సర్వజగత్తునకును సర్వవిధకారణము విష్ణువనియే చెప్పియుండుటను అందఱికి నేటతెల్లముగా తెలిపెడు ఆళ్వార్లపాట సమస్తశ్రుతులకును విష్ణువునెడనే తాత్పర్యమని స్పష్టముగ మందలించుచున్నది. ఇంకను యజుర్వేదములో "అగ్నిరవమో దేవతానాం విష్ణుఃపరమః" అనియు, "విష్ణుముఖావై దేవాః" అనియు విష్ణువే దేవతలలోమిన్నయనియు చెప్పఁబడుచున్నది.

అద్:—"కారణంతుధ్యేయః శంభురాకాశమధ్యేధ్యేయః అహమేవవర్తామి అహమేకః ప్రథమమాసం" ఇత్యాదులచే అథర్వశిఖోపనిషత్తులోఈశ్వరుడొక్కడే జగత్కారణమని చెప్పెడు ఈశ్వరవాక్యము తనకేపరత్వమును వెలిపుచ్చియుండుటను నీవు ఎట్లుసమర్థింపఁగలవు.

విశి:—"యోగాద్రూఢిర్బలీయసీ" అని శబ్దములను విడదీసి యర్థముచెప్పుటకంటె విడదీయకయే ప్రసిద్ధమైనఅర్థముచెప్పుట ఉచితమైనను, "ప్రోక్షణీష్వర్థసంయోగాత్" అను మీమాంసాసూత్రార్థమును చెప్పునపుడు మీమాంసకులచే సముదాయార్థమైన రూఢ్యర్థము చెప్పుట వేఱువిరోధమైన వాక్యార్థములు లేనిచోటనే యని నిర్ణయింపఁబడియుండుటవలనను, ప్రకృతమున విష్ణువే జగత్కారణము పరతత్త్వము అనిక్రిందచెప్పిన పెక్కుశ్రుతిస్మృతిసంప్రదాయములచే ఏర్పడినది కావునను, దానికి విరోధముగ"శంభు" శబ్దమునకు రూఢ్యర్థమును ఒప్పుకొనక శంసుఖం భవతి అస్మాదితి వ్యుత్పత్తిచేత మోక్షరూపసుఖమును ఈనేర్చిన విష్ణువే యని అర్థము.

అద్:—"ఇచ్ఛామీనవిహార.............................పణః" "మత్స్యఃకూర్మోవరాహశ్చ నారసింహశ్చ వామనః। రామోరామశ్చ రామశ్చ కృష్ణః కల్కిచతేదశ" అను ఆధారములచేతను,

"కన్నపురమాలే కడవుళిలు నీయదికం
ఉన్నిలుమో యానదిక మెన్నుకేళ్—మున్నమే
ఉన్‌పిరప్పో పత్తాముయిర్ శివనుక్కోర్ పిరప్పు
ఎన్‌పిరప్పెణ్ణ త్తొలయాదె"

[ఇదియొకశైవుడు విష్ణువునుచూచి పరిహాసముగ చెప్పెడు మాట. కన్నపురములోని విష్ణువా! అందఱు దేవతలలో నీవు పెద్ద; నీకంటె నేను పెద్ద, ఏలయన, వినుము. నీజన్మములా పది; శివునికి జన్మమొక్కటే. నాజన్మములా అనంతములు అని] అను మాటచేతను విష్ణువునకు పెక్కుజన్మములు కలవని ప్రసిద్ధమైయుండుటవలనను రామావతారములో రాముని యముడు తానె వచ్చిపిలిచి పోవునట్లును, కృష్ణావతారమున కృష్ణుడు బోయనిచే కాలిలో వేయఁబడి పరమపదమునకు విజయముచేసినట్లును పురాణములమూలాన తెలియుచుండుటవలనను సామాన్యనరునివలెనె "జాతస్యహిధ్రువోమృత్యుర్ధ్రువంజన్మమృతస్యచ" అని అతని గుఱించి చెప్పి యుండుటవలనను ఆ విష్ణువునకు పరత్వమెట్లు సిద్ధింపఁగలదు?

విశి:— "అజాయమానో బహుధావిజాయతే" అని విష్ణువునుగూర్చి చెప్పియుండుటవలన పుట్టుకలేనివానికి పెక్కుపుట్టుకలు కలవనుటయును, స్వేచ్ఛచే వలసినపుడు బహురూపములు ధరించెడు వాడనుటయును "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనుటచే అవతారమనియే అర్థము చెప్పవలయునె కాని సామాన్యజనమువలె అతడును పుట్టుచున్నాడని చెప్పవీలులేదు.

మరియు, రామాయణాదులందును రాముడవతరించినకాలమున "కౌసల్యాశుశుభేతేన పుత్రేణామితతేజసా" అనియు భాగవతములో కృష్ణావతారకాలమున, "తమద్భుతం బాలకమంబుజేక్షణం చతుర్భుజం శంఖగదాద్యుదాయుధం। శ్రీవత్సలక్ష్మంగళశోభికౌస్తుభం పీతాంబరంసాంద్రపయోదసౌభగం॥ మహార్హవైడూర్యకిరీటకుండలత్విషా పరిష్వక్తసహస్రకుంతలం। ఉద్దామకాంచ్యంగదకంకణాదిభిర్విరోచమానం వసుదేవఐక్షత॥" అనియు చెప్పుటవలన సామాన్యనరునివలె అతడును పుట్టియుండినయెడ కౌసల్యాదేవియు, దేవకియు, "గుర్వీంప్రసవవేదనాం" అని చెప్పబడిన మిక్కిలి కష్టమైన బిడ్డపుట్టును అనుభవింపక బిడ్డలనుచూచి ఆనందించినట్లే తెలియవచ్చుటవలన శ్రీరామకృష్ణులు అయోనిజులనియే చెప్పవలయును. వీరనుభవించిన సుఖదుఃఖములంతయు అభినయమనియే పురాణమువలన తెలియవచ్చెడు. లోకపునడవడులనే చూపుటకై వారు అవతరించుటంజేసి యముడు వచ్చినట్లును, బోయచే వేయబడినట్లును కానిపించుట అభినయమాత్రమేయని చెప్పబడియుండుట వలన కేవలము వీరిజన్మములను అవతారములనియే చెప్పవలయును పరతత్త్వమనియే గ్రహింపవలయును.

అద్:— "సదేవసోమ్యేదమగ్రఆసీత్; ఏకమేవాద్వితీయం; ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్; విజ్ఞానఘనఏవ; విజ్ఞానమానందంబ్రహ్మ; నదృష్టేః ద్రష్టారంపశ్యేః; నేహనానాస్తికించన అన్యత్రేనహిప్రత్యూధాః, తమసాగూఢమగ్రే ప్రకేతం; అనాదిమాయయాసుప్తో యదాజీవః ప్రబుధ్యతే" ఇత్యాదిశ్రుతిస్మృతులచే కేవలచిద్రూపమైన బ్రహ్మము ఒక్కటేనిత్యము; తక్కినది అసత్యమనియు, అవిద్యయను పదార్థముచే ప్రకాశరూపమైన పరబ్రహ్మము మూయబడి తర్వాత ప్రపంచమంతయు రజ్జువునందు సర్పముతోచుటవలెను; స్వచ్ఛమైన స్ఫటికముయొక్క సన్నిధానమున దాసానిపువ్వుండినచో ఆపువ్వుయొక్కరుచే తెల్లస్ఫటికము ఎఱ్ఱనిదిగా చూపట్టునట్లును; బ్రహ్మమునందు లేకయుండినను ఉన్నట్టై భ్రాంతిజనింపించెడు. ఆబ్రహ్మము జ్ఞానవంతముకాదు; ప్రకాశమాత్రమైయున్నది, అదియు విభు; నిత్యము; ఒకప్రమాణమునకును గోచరించునదికాదు.

అట్టిబ్రహ్మము తానేభ్రమించి జీవేశ్వరులవలె ప్రతిభాసించి; కొంతకాలము కలంగియుండి; కాలవిశేషమున. "భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః" 'తత్త్వమసి' ఇవి మున్నగుశ్రుతులను గురువు నొద్ద ఉపదేశించుకొని వాక్యార్థజ్ఞానముచేత అవిద్యను తొలగించుకొని ముక్తమగును. ముక్తుడగు ఆత్మయే పరమాత్మ పరబ్రహ్మమని చెప్పబడుచున్నాడేకాని అన్యముగ నీవుచెప్పినట్లు కనబడుట లేదు. కావున ఉత్కృష్టవస్తువు విష్ణువని చెప్పినది బ్రహ్మమునకు భ్రమమువచ్చినపుడు చెప్పబడినదే కాని మరేమియు లేదు. గనుక జ్ఞానస్వరూపమైన బ్రహ్మము ఒక్కటే మేలైనవస్తువనియు, తక్కినవి అనృతమనియు చెప్పవలయును. ఏదికన్నులకును, బుద్ధికిని, గోచరించునదియో అది అసత్యమనియే అనుమానముచే నిశ్చయింపబడినది.

వి॥:—కన్నులకును, బుద్ధికిని విషయమైనదంతయు అసత్యము. ["యద్దృశ్యంతన్మిథ్యా"] అని చెప్పవలనుపడదు; 'యద్దృశ్యం తద్వినాశ్యం వికార్యంవా' అనియే చెప్పవలయును. అనఁగా: మఱియొకవిధమున మాఱుపాటుచెందిన పదార్థముగ ఉన్న దేకాని శశశృంగము (కుందేటికొమ్ము) నువలె దాని నసత్త్వమని చెప్ప వీలులేదు. కాఁబట్టి శాస్త్రముచేత బ్రహ్మమును తెలిసికొనవచ్చును. "హృదామనీషా మనసాఽభిక్లప్తః" 'మనసాతువిశుద్ధేన' ఇవి మొదలైనశ్రుతులచే తెలియఁగ వీలగుననియే చెప్పఁబడియున్నది. ఇంకను బ్రహ్మమునకు అవిద్యచే భ్రమకప్పుట మిక్కిలి తక్కువైన స్వభావము. ప్రకాశరూపమైన బ్రహ్మము నొద్దకు అసత్యమై చీకటివలె ఉండు అవిద్య ఏవిధమున వెడలనేర్చును? అట్లొప్పుకొన్న, 'ఉదితఅదిత్యేతమోనష్టం' అనుటవలె చెప్పుఅర్థములును, ప్రత్యక్షమును విరుద్ధమగును. బ్రహ్మమునకు జ్ఞానమను స్వభావములేనిచో "పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే" 'స్వాభావికీ జ్ఞానబలక్రియాచ' ఇవి మొదలైన శ్రుతులన్నియు వ్యర్థమగును. కావున నీవు చెప్పిన శ్రుతులకును 'ప్రపంచమంతయు సత్యము; ఏదానియందును పరమాత్మ అంతర్యామియై యున్నాఁడు. ఆతనివీడియున్న పదార్థమొక్కటియు లేదు' అనియె తాత్పర్య పడవలెను. ఏలయన, 'యస్యపృథివీ శరీరం' మొదలైనశ్రుతులచే చిదచిచ్ఛరీరకపరమాత్మయొక్కఁడే యని అద్వితీయపదమునకర్థము.

కావున, అసత్యం తవ దృష్టాంతే ఘటాదిచ మృదాదిచ! లోకదృష్ట్యోభయం సత్యం విభజ్యోపాధ్యాప్తిఃకథం' అనుమీకు వాస్తవమైన దృష్టాంతముచూపలేక యున్నాను. జపాకుసుమ (దాసాని పువ్వు స్ఫటికమణి దృష్టాంతములోను అన్నియు సత్యమే. అందువలన, 'ప్రత్యేయస్తువిలక్షణః ప్రకృతిత స్త్రీశాపతి స్తత్పర స్తస్మిన్నాత్మభరార్పణం హితతమం తచ్ఛేషవృత్తిః ఫలం' అనుటయే విశిష్టాద్వైతియొక్కముఖ్యాభిప్రాయము.

(1) యస్మిన్నధ్యస్త మేతత్ త్రిభువనమఖిలం యచ్చపశ్యత్యవిద్యాముగ్ధం స్వాధ్యస్త మేతద్యదపినిజవపుర్వీక్షతే ముచ్యతేయత్। జ్ఞానం జ్ఞేయాదిహీనం భవతియదపదం, సంవిదానిర్విశేషం సత్యంతద్బ్రహ్మమిథ్యా తదితరదఖిలం కోన్యథావక్తుమీశః॥'

(2) "నాధ్యాసస్స్వప్రకాశే తిమిరమివరవౌ జ్ఞానబాధ్యాచమాయా న బ్రహ్మజ్ఞానరూపం స్థగయతి నతతో బంధమోక్షౌ చతస్య। నజ్ఞానజ్ఞేయహీనం నసదమతిపదం నిర్విశేషం నకించిత్ సత్యం స్యాన్మానసిద్ధం జగదపి నయది స్వోక్తిబాధాదయస్స్యుః॥"

(3) "కస్త్వం తత్త్వవిదస్మి వస్తుపరమంకింతహీం విష్ణుః కథం తద్వేదంపరతైత్తిరీయకముఖత్రయ్యంతసందర్శనాత్। అన్యాస్తర్హిగిరఃకథం గుణవశా దతాగిహరుద్రఃకథం తద్దృష్ట్యాకథముద్భవత్వవతరత్యన్యత్ కథంనీయతాం॥

ఈప్రకారముగ ఉపన్యాసమును భాగవతవందనాది పురస్సరముగ ఉపసంహారము చేసికొనియెదను.



# పుస్తకవిమర్శనములు.

## ఆంధ్రముకుందమాల.

ఇది తిరుపతిలో న్యాయవాదులగు శ్రీమదుభయ మాడభూషిమతం వేంకటాచార్యులు బి. ఏ. గారిచే రచియింపబడినది. సంస్కృతభాషలో కులశేఖరాళ్వార్లు సాయించిన శ్లోకరూపమైన ముకుందమాలకు సరిగ పద్యరూపమైన యాంధ్రానువాదము. సంస్కృతమున ముకుందమాల భగవంతునియెడ భక్తిప్రార్థనము భగవద్విషయేతరనైరపేక్ష్యము, నారాయణపారమ్యము, మనోలోకహితోపదేశము మున్నగు విషయములను దేవభాషలో నతిసులభశైలిలో నతిలలితములైన శ్లోకములతో బోధించుచుండును. ఈ ముకుందమాలను కంఠములోధరింపనివారు భక్తకోటిలోనుండరు. అట్టి ఆంధ్రముకుందమాలయు లలితపదసౌభ్రాత్రసమంచితమై, నిర్దుష్టమై, నిరర్గళధారాశుద్ధిసమేతమై, దీర్ఘసమాసాన్వయక్లేశాది రహితమై, ద్రాక్షాపాకమధురమై దైవారుచు, వాచకులకు సుబోధమునగు శైలిలో వ్రాయఁబడియున్నది. ఇది మూలములోని యభిప్రాయమును వదలక మూలమునకు సరియైన యాంధ్రానువాదము. ఈవిషయమున కవిగారు మిగులశ్రద్ధాప్రయాసములను వహించియున్నవారు. ఇది చదువువారికి ఒక్కదానిభాషాంతరీకరణముగాఁ దోఁపక స్వతంత్రముగ రచింపబడినట్లు తోఁచెడు. దీనిమూలముతో సంప్రతించి చదువుకొనుటకై మూలగ్రంథమును దీనిక్రిందముద్రితమై యున్నయది. కావున ఆంధ్రులెల్లరు దీని రప్పించి చదివి కంఠస్థము చేసికొని భగవంతునియపారకృపకు పాత్రులగుదురుగాక—దీనం బద్యములు 42. దర 2-అణాలు.

ఇట్లే యీకవి దివ్యప్రబంధములోని కొన్నిపాశురములను ఆంధ్రములో ననువదించియున్నాఁడు. ఆ యనువాదమును బహురమణీయము.

* * * *

## ప్రసన్నమార్కండేయము.

ఇదియొక ఆఱంకములనాటకము. దీనిని, శ్రీమదుభయ తిరుక్కోవిలూరు మహాస్వామి కుమార ఆదివరాహాచార్యులను వారు రచించిరి. ఈస్వాములు మహాప్రయాసము పుచ్చుకొని అష్టాదశపురాణముల శోధించి 'మార్కండేయుని యమబాధను బాపుటకై పరమేశ్వరుఁడు లింగమునందావిర్భవించి యంతకునియంతమొందించి మార్కండేయుని కాచినవృత్తాంతమును సాధారణముగ లోకములోఁ జెప్పుకొనుదానిని' విపులముగ విమర్శించి సకారణముగ అట్టికథలేదని నిరూపించి మార్కండేయుఁడు పరమవైష్ణవుఁడుకాని శైవుఁడుకాడని స్థాపించియున్నారు. వీరు మార్కండేయుని విషయమునఁ

జేసినతలస్పర్శియగు విమర్శము అందఱుచదువుటకై యీనాటకమునకుపోద్ఘాతముగ ముద్రితమైయున్న యది. అది సువర్ణ్యము దర్శనీయము. ఆయుపోద్ఘాతము 34 పుటలు పెరిగియున్నది. ఈయుపోద్ఘాతములో మృకండుభగవంతునకుందపమొనర్ప భగవదంశముచేత మార్కండేయుడు జన్మించి నారదోపదేశము వలన దీక్షోపదేశమువడసి తపమొనరించి నారాయణు మెప్పించి ఆయనవలన మహాప్రళయమందు భగవంతునితోనుండి మాయాపరివర్తనముఁ జూచునట్లు వరముప్రాపించి పరమేశ్వరునివలన చిరంజీవిత్వము పురాణప్రవక్తృత్వము మొదలగు వరములపొందినట్లు పురాణాదులచే నిర్ధారితంబగుకథను స్వయముగ నించుకవిస్తరింపఁజేసి అందఱకి దృశ్యముగనట్లు దృశ్యకావ్యముగ నొనర్చిరి. పద్యములు ప్రౌఢములైనను లలితములు కథాసంవిధానాదులు రమణీయములే. అచ్చటచ్చట విశిష్టాద్వైత మతసిద్ధాంతాంశములఁ జొన్పియున్నారు. పౌరాణికచరిత్రము విస్తరింపఁజేయుటతక్క కవిగారియొక్క స్వకపోలకల్పితాంశము లెక్కువగా నించేమియులేవు. ఇది నాటకపద్ధతినంతగా పాటించివ్రాయఁబడినట్లు తోపలేదు. నాటకములోని ముఖసంధ్యాదులకు నిందు నిర్వాహమెట్లో తెలియకున్నది. గణయతిస్థానములలోఁ గొన్నియపభ్రంశములు ముద్రణదోషపతితములై స్ఫురించెడు. ఈ నాటకమపూర్వముగాన నందఱకవశ్యపఠనీయము. దీని పుటలు 66. దర 1-0-0.



శ్రీః

శ్రీమతే లక్ష్మీనృసింహపరబ్రహ్మణే నమః

యోఽన్తః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిలశక్తిధరః స్వధామ్నా।
అన్యాంశ్చ హస్తచరణశ్రవణత్వగాదీన్
ప్రాణాన్నమో భగవతే పురుషాయ తుభ్యమ్॥

# సంపాదకీయములు.

పశుపత్యధికరణము:—

‘జిజ్ఞాస’ అనుపత్రికలో దాని సంపాదకులలో ఒక్కరగు బ్రహ్మశ్రీ వైద్య విశారద నటేశశాస్త్రిలు అనువారు, ‘పత్యురసామంజస్యాత్’ అనియారంభించిన అధికరణముయొక్క తాత్పర్యమునుగుఱించి శ్రీశంకరాచార్యులు ఏమి యభిప్రాయపడియున్నారను దానిని విచారింపఁబూని, దాని నిర్ణయమును ఒక్కతీరుగ చెప్పి శ్రీరామానుజ భాష్యవ్యాఖ్యాతయగు శ్రీశ్రుతప్రకాశికాచార్యులచేత ఆయధికరణసంబంధముగ చెప్పబడిన కొన్నివాక్యములను ఉదాహరించి వానికద్వైతులు ఏమిప్రతివచనమిడెదరు అను దానిని వివరించి యున్నారు. ఈ శ్రీశంకరాచార్యాభిప్రాయ నిర్ణయములోను మీఁద చేయఁబడు విచారమునందును, శ్రీశాస్త్రిలు చెప్పియుండు విషయములలో కొన్నియాంశకలు పొడమెడు వానిని ఇట మేము ప్రస్తావించెదము.

తొల్లి సూత్రాభిప్రాయమును గుఱించిన సంశయము!—సూత్రకారులు వైదికమతమును స్థాపనము చేయఁబూని దాని స్థాపనార్థము వేదాంతవాక్యముల తాత్పర్యమును నిర్దోషముగ నిర్ధారించిన వెనుక పరపక్షనిరాకరణము చేయక యున్నచో స్వపక్షమునకు స్థైర్యమేర్పడదని తలచి ఈ ‘పత్యురసామంజస్యాత్’ అను సూత్రము కనఁబడు రెండవ అధ్యాయము రెండవపాదములో పరమత నిరా

కరణము సేయనారంభించుచున్నారు. మొదట సాంఖ్యమతమును తర్వాత వైశేషిక మతమును పదంపడి బౌద్ధమతమును దాని వెనుక ఇంకను ఇటువంటి నానామతముల నిరాకరించి పిదప పత్యురసామంజస్యాత్ అను సూత్రమాదిగ ఈఅధికరణమును ఆరంభించుచున్నారు. ఈ యధికరణమున ఏమతము నిరాకరింపఁబడుచున్నదనుటయే ప్రకృతవిచారణీయాంశము. శ్రీరామానుజాచార్యులు 'పత్యుః—పశుపతియొక్క—(మతముఅనాదరణీయము) అసామంజస్యాత్-(అది) అసమంజసముగనుండుటవలన' అని సూత్రమున కర్థమొనర్చి ఈఅధికరణముచే సూత్రకారులు శైవాగమముల నిరాకరించెదరు, అని భాష్యము చేసియున్నారు. శ్రీశంకరాచార్యులు" పత్యుః-ఈశ్వరునకు (కేవలము జగమునకధిష్ఠాతగా (నిమిత్తకారణముగ) నుండు స్వభావము యుక్తము కాదు), అసామంజస్యాత్—(అది) అసమంజసముగనుండుటంబట్టి, అని భాష్యము చేసియున్నారు. దీని చూడఁగా 'ఈయధికరణముశైవాగమ నిరాకరణపరము' అని చెప్పుటలో నభిప్రాయము లేనట్లు తోచును. శ్రీశంకరాచార్యుల వాస్తవాభిప్రాయమేమి యని విచారింపఁజొచ్చినచో, అందువివాదము సంభవించును. శ్రీశాస్త్రిలు అనేక కారణములను ఆధారముగఁ గైకొని, శ్రీశంకరాచార్యుల యభిప్రాయమును నిర్ణయించినదానిని ఈక్రింద చెప్పఁగలవిధమున మనము చూతుము. 'జగమునకు ఈశ్వరుఁడు కేవలము నిమిత్తకారణమై యున్నాఁడు.' అని యెవ్వరెవ్వరు వాదించెదరో వారివారి మతమునే సూత్రకారులు ఈయధికరణములో నిరాకరించెదరు. అనునదియె శ్రీశంకరాచార్యుల యభిప్రాయమనియు, సాంఖ్యులలో కొందఱు వైశేషికులలో కొందఱు మాహేశ్వరులు వీరందరును ఈశ్వరునికి కేవలము నిమిత్తకారణత్వము చెప్పియుండుటవలన వారినందఱినే యిచ్చట నిరసించునట్లుగా శ్రీశంకరాచార్యులు తలచెదరనియు, మాహేశ్వరులనుగుఱించి శ్రీశంకరాచార్యులు సామాన్యముగ ప్రస్తావించియున్నను, వారామాహేశ్వరశబ్దముచే నాలుగువిధములైన మాహేశ్వరులలో నొక్కరగు పాశుపతులను మాత్రము గ్రహించుచున్నారే కాని తక్కుంగల మాహేశ్వరుల గ్రహింపలేదు, అనియు శ్రీశంకరాచార్యుల ననుసరించియే సూత్రవ్యాఖ్యానముచేసియున్నట్లు శ్రీఅప్పయదీక్షితులచే కొనియాడఁబడు శ్రీకంఠులును ఆలాగే వివరించియున్నారు కావునను శ్రీశంకరాచార్యుల మతము ఇదియే యని శ్రీశాస్త్రిలు చెప్పెదరు, దీని నింకఁ బరామర్శించెదము.

" పత్యురసామంజస్యాత్ ":—అను అధికరణమును శ్రీశంకరాచార్యులు " ఇదానీం కేవలాధిష్ఠాత్రీశ్వరకారణవాదః ప్రతిషిధ్యతే " (ఇప్పుడు ఈశ్వరుని కేవల నిమిత్తకారణముగానే చెప్పెడుసిద్ధాంతముగలవారి మతము నిరాకరింపబడు చున్నది.) అని ఉపక్రమించుచున్నారు, అనునది వాస్తవమే; శైవాగమములు ఇచ్చట నిరాకరింపఁబడుచున్నవని విశేషించి యిట చెప్పలేదు. ఉపపాదనము లోను " కేచిత్ సాంఖ్యయోగ వ్యపాశ్రయాః కల్పయంతి "అనియు, " మాహేశ్వ రామన్యంతే " అనియు " తథావైశేషికాదయోపి కేచిత్ " అని ముగ్గురిని ప్రస్తావించి, " అతఉత్తరముచ్యతే " అని వీరుముగ్గురికిని ఈ అధికరణము సమా ధానముచెప్పెడు అని సాధారణముగనే చెప్పియున్నారు. గనుక. మాహేశ్వరుల మా త్రముగాక కేవల నిమిత్తకారణ ఈశ్వరవాదులైన మిగతవారిని ఈఅధికరణ నిరాకర ణమునకు విషయముగ శ్రీశంకరాచార్యులు గ్రహించియున్నారు; అనుటలో ఆక్షేపములేదు. కాని 'మాహేశ్వరశబ్దముచేత' 'శ్రీశంకరాచార్యులు, మాహేశ్వ రులలో ఒక్కతెగవారగు పాశుపతులనుమాత్రము పేర్కొనుచున్నారే కాని కడమ మూడుతెగలవారిని ఇట గ్రహింపలేదు ' అని శ్రీశాస్త్రిలు చెప్పుట ఆక్షేపార్హ ముగానే తోచుచున్నది. అట్లు మాహేశ్వరులలో ఒక్కతెగవారిని మాత్రము శ్రీ శంకరాచార్యులు ప్రస్తావింప ఇష్టపడియుండినచో, సాంఖ్యులలోను వైశేషికుల లోను ఇచ్చట ఒక్కతెగవారిని మాత్రము నిర్దేశించుటకై " కేచిత్ సాంఖ్య యోగవ్యపాశ్రయాః " అనియు "వైశేషికాదయోపి కేచిత్ " అనియు, "కేచిత్" శబ్దమును ప్రయోగించునటులే " కేచిన్మాహేశ్వరాః " అని మాహేశ్వరులవిషయ ములోను " కేచిత్ " శబ్దమును ప్రయోగించియుందురు. అట్లు " కేచిత్ " శబ్ద ము లేకయే " మాహేశ్వరామన్యంతే " అని సామాన్యముగ చెప్పియుండుటను చూడగా సకల మాహేశ్వరులను వారు చెప్ప నిచ్ఛించినవారనియే తోచు చున్నది. మఱియు " కార్యకారణయోగవిధిదుఃఖాంతాః పంచపదార్థాః " అను వాక్యము ఉపపాదించుటలో అగపడుచున్నదను కారణమువలన ఆయైదుపదార్థముల నంగీకరించు పాశుపతులు మాత్రమిచ్చట చెప్పనుద్దేశింపఁబడుచున్న వారనుటను మన మంగీకరించినను, నిగమనములో కనంబడు " ఏవమన్యాస్వపి వేదబాహ్యాస్వీ శ్వరకల్పనాసు యథాసంభవమసామంజస్యం యోజయితవ్యం " (ఈలాగే వేద బాహ్యములైన యీశ్వరకల్పనలయందు అసామంజస్యమును చేర్చుకొనునది.) అను

వాక్యబలముచే మిగతమువ్వురు మాహేశ్వరులును గ్రహింపబడి నిరాకరింపఁబడు చున్నారు; అని మనము తెలిసికొనవలసినది లేదా? కడమ మాహేశ్వరులు వేద బాహ్యులైయుండినఁగదా అట్లుమనము తెలిసికొనవలయునంటే, మాహేశ్వరులం దఱు వేదబాహ్యులనునది శ్రీశంకరాచార్యుల యభిప్రాయముకాదా? కేవల నిమిత్తకారణ ఈశ్వరవాదముచేయుటతోపాటు శ్రుతిబలమును వదలి ఆగమబలము పట్టుకొనియే వారందఱు ఈశ్వరుని సాధింపలేదా? అందుచే నేమి తప్పునిన, శ్రీశంక రాచార్యులకు ఆగమముల ప్రామాణ్యమనభిమతమనుట " పరస్యాపిసర్వజ్ఞప్రణీ తాగమ సద్భావాత్ సమాన మాగమబలమితిచేన్న. ఇతరేతరాశ్రయప్రసంగాత్ ఆగమప్రత్యయాత్ సర్వజ్ఞత్వసిద్ధిః సర్వజ్ఞప్రత్యయాచ్చాగమసిద్ధిః " అను ఆచార్యు లవాక్యముచేత స్పష్టమగుచున్నది. శ్రుతివాక్యములవలన వారీశ్వరుని సాధింపలే దనుటయు వ్యక్తము. ఏలయన, శ్రుతిబలమును పట్టి ఈశ్వరుని సాధించు పక్షమున శ్రుతివాక్యములు పురుషోత్తమునికి అసాధారణమగు నారాయణయను నామము చేతనే కారణవస్తువును తెలుచుగా నిర్దేశించుటంబట్టి, ఆనారాయణుఁడే జగత్కా రణమైన బ్రహ్మము అని యొడ్డంబడునట్లగును. అది వారలకనిష్టమేకదా! మాహే శ్వరులందఱు వేదబాహ్యులనుటకు అన్యకారణములును గలవు.

" దీక్షాప్రవేశమాత్రేణ బ్రాహ్మణో భవతి క్షణాత్।
కాపాలంవ్రతమాస్థాయ యతిర్భవతి మానవః। "

(ఒక్క కార్యవిశేషముచే విజాతీయులకు బ్రాహ్మణత్వప్రాప్తియు ఉత్తమాశ్రమ ప్రాప్తియు ఒక్కజన్మమందే సంభవించును) అని వారల యాగమము చెప్పుటను వేదమునకు సమ్మతమని శ్రీశంకరాచార్యులు గైకొందురా? ఇంకను వారిధర్మ ములందు పెక్కు వేదవిరుద్ధములుండుటవలన వారి నవైదికులనియే శ్రీ శంకరా చార్యులు గ్రహించియుండవలయును; కాన క్రింద నుదాహరింపఁబడిన " ఏవమన్యా స్వపి వేదబాహ్యస్వీశ్వరకల్పనాసు " ఇది మొదలగు ఉపసంహారవాక్యమునకు అం దఱు మాహేశ్వరులును విషయమగుచున్నారనియే మాకు తోచుచున్నది.

ఒకవేళ, యుక్తిబాహుళ్యముగల అవైదికదర్శనములు మాత్రము నిరా కరింపఁబడుచున్నవి గనుక అటువంటియుక్తిబాహుళ్యములేని శైవాగమములకీచోట ప్రాప్తిలేదు, అని శ్రీశంకరాచార్యు లభిప్రాయపడియుందురేమో యనిన, అట్లు వారు అభిప్రాయపడియుండరనియే చెప్పవలయును. ఏలయన, ఈపాదమందే ఆగమత్వముచే

శైవాగమతుల్యమైన పాంచరాత్రాగమమును కేవలము ‘ వేదవిరుద్ధం విప్రతిషిద్ధం’ అనుకారణముల నాధారీకరించుకొని వెంబడివచ్చు ‘ ఉత్పత్త్యసంభవాత్ ’ అను అధికరణములో శ్రీసూత్రకారులు నిరాకరించునట్లుగా శ్రీశంకరాచార్యులు వక్కాణింపలేదా? ఆనిరాకరణమునకు ప్రాప్తియున్నప్పుడు శైవాగమనిరాకరణ మునకేల అప్రాప్తియుండవలయును. మఱియు, ఈపాదారంభమునందు శ్రీశంకరా చార్యులుచెప్పియుండు వాక్యమువలన ‘ ఈలాటి ఆగమనిరాకరణము ఈపాదము నకు సంగతమైనది ’ అని వారు అభిప్రాయపడినట్లే మనమెఱుంగుదుము. “ తదా యుక్తిగాఢత్వసంభవేన సర్వజ్ఞభాషితత్వాచ్చ శ్రద్ధాచ తేష్వితృతస్తదసారతోప పాదనాయ ప్రయత్యతే ” అనునది వారివాక్యము. “ యుక్తులచే నిండియున్న వేదవిరుద్ధపరమతములు, సర్వజ్ఞుని భాషితములని చెప్పఁబడు వేదవిరుద్ధపరమతము లును నిరసింపదగినవి ” అనునర్థము ఆవాక్యములనుండి తేలుచున్నది. గనుక శైవాగమము మొదలగు ఆగమముల నిరాకరణము ఇచ్చట సంగతమనియే శ్రీ శంకరాచార్యులు అభిప్రాయపడునట్లు చెప్పవలయును.

అయితే ఈయధికరణ భాష్యారంభమున్న ‘ ఇదానీంమాహేశ్వరాః ప్రతి క్షిప్యంతే ’ అని చెప్పక “ ఇదానీం కేవలాధిష్ఠాతీశ్వరకారణవాదః ప్రతిషిధ్యతే ” అని ఏల చెప్పియున్నారు? అని యడుగవచ్చును. వారట్లు చెప్పుట మాహేశ్వ రులతో సేశ్వరసాంఖ్యులను, కొందఱు వైశేషికులను చేర్చి నిరాకరించుటకే కాని, మాహేశ్వరులలో కొందఱిని తీసివేయుటకు కాదని మనకు తోఁచుచున్నది. సంగ తిని సూచింపఁజేయుటకు ఆరంభమున సామాన్యముగ ప్రస్తావించి, వెనుక ఉపపాద నములో విషయమును విశేషముగ నిర్దేశించుట యను సంప్రదాయమును శ్రీశంక రాచార్యులు అనుసరించుచున్నారని మే మెన్నెదము. పాంచరాత్రనిరాకరణ ములో పాంచరాత్రికులు మాత్రమే విషయమైనను, అవతారికలో ఆవిషయమును విశేషించి చెప్పక, “ యేషాం ప్రకృతిశ్చాధిష్ఠాతాచ ఉభయాత్మకం కారణ మీశ్వరోఽభిమతస్తేషాం పక్షః ప్రత్యాఖ్యాయతే ” అని సామాన్యముగనే చెప్పి యున్నారు. ఇచట ఈవిధమున సామాన్యముగ చెప్పుట పెద్ద ఒకయాక్షేపమునకు చోటైయున్నప్పుడును; వారట్లు చెప్పియుండుటను చూడఁగా ఒకయధికరణమున కును, మఱియొకయధికరణమునకును, ఉన్నసంగతిని సూచించుటకే వారటువంటి శైలిని అనుసరించుచున్నారని మనకు తోఁచుచున్నది.

శ్రీకంఠుల సూత్రవ్యాఖ్యానము శ్రీశంకరాచార్యుల అభిప్రాయము ననుసరించుచున్నది, అని చెప్పుటను నిరాక్షేపముగ అందఱును ఒప్పుకొన్నలేదు. 'వారు సూత్రములను సగుణబ్రహ్మప్రతిపాదకముగ వ్యాఖ్యానము చేసియుండిన అది మందాధికారుల నుద్దేశించి చేయఁబడినది, అనుటయే శ్రీఅప్పయ్యదీక్షితుల అభిప్రాయముగ నుండవచ్చును. అన్యులు కొందఱు విద్వాంసులు ఆయభిప్రాయమునకు లోఁబడకయే యుండుటను మన మెఱుఁగుదుము. కావున, శ్రీకంఠుల అభిప్రాయము నాధారముగఁ గైకొని శ్రీశంకరాచార్యుల అభిప్రాయము నూహింపఁ గడంగుట యుక్తియుక్తము కాఁజాలదు. ఈలాగు శ్రీశాస్త్రుల నిర్ణయమును బాధించు పెక్కు హేతువులు అగపడుటవలన ఆనిర్ణయము దోషదుష్టమని యే మేము భావించెదము.

వెంబడి సంశయము- శ్రీశ్రుతప్రకాశికాచార్యుల సూక్తులకు అవైదికులు చెప్పునట్లుగా శ్రీశాస్త్రులు చెప్పునట్టి ప్రతివచనములను గుఱించినది. శ్రీశ్రుతప్రకాశికాచార్యులు, ఈ ప్రకరణమున, "నిమిత్తమాత్రేశ్వరపక్షం నిరాచికీర్షతా న కేవల మనుమానమేవ కింతు తన్మూలభూతాగమోఽపి నిరాకార్యః" (నిమిత్తమాత్ర ఈశ్వరవాదమును నిరాకరణము చేయువారు., అనుమానమును నిరాకరించుటతో. ఆయనుమానమునకు మూలభూతమైన ఆగమమును నిరసింపవలసినవారే) అని చెప్పి వెనుక "ఏవంద్వయోరపి వ్యుదసనీయత్వే సతి, అనుమానం శాస్త్రోపక్రమ ఏవ నిరస్య నీయం; తన్నిరసనేనవినా శాస్త్రారంభానుపపత్తేః" (ఇట్లు రెండును నిరాకరణీయములగునప్పుడు, అనుమానము శాస్త్రారంభమనందే నిరాకరింపఁబడవలయును; అది నిరాకరింపఁబడనిపక్షమున శాస్త్రారంభమె అయుక్తమగును గదా!) అని వాదించియున్నారు. దీనికిచ్చట చెప్పియుండు ప్రతివచనము; శాస్త్రారంభము అనుమానముయొక్క అప్రామాణ్యమును గుఱించినది కాదు; కాని అది శ్రుతి వాక్యములలో ఆపాతముగ (పైపైన) తోఁచెడు పరస్పరవిరోధములను గుఱించినది అనుటయే. ఇట్లు చెప్పుట వాస్తవస్థితికి విరుద్ధమైనది. సూత్రములు మొదట, "ఈశ్వరసాధనములో అనుమానము ప్రమాణము కాఁజాలదు." అనుటను సాధించి, పిదప శ్రుతివాక్యములను తీసికొనియే ఈశ్వరుని సాధింపవలయును కావున ఆశ్రుతివాక్యములను సమన్వయము చేయవలయునని ఆసమన్వయములో ప్రవర్తించుచున్నది. కాఁబట్టి వేదాంతశాస్త్రారంభము అనుమానముయొక్క ప్రామాణ్యము

నిరాకరింపఁబడిననే ఉపపన్నమగును బ్రహ్మము, అనుమానము మొదలగు ప్రమాణాంతరములచే సిద్ధించుపక్షమున, ఈవేదాంతశాస్త్రము ఎందులకై యారంభింపవలయును? అనుమానము ప్రమాణముకాదు అనుటను సాధించిన తర్వాత కదా సమన్వయమునకు ప్రాప్తి? అందుచే "అనుమాననిరసనేనవినా శాస్త్రారంభానుపపత్తేః" అను శ్రుతప్రకాశికాచార్యుల వాక్యమందు ఏవిధమైనదోషమును మాకు పొడకట్టలేదు. ఈచోట చెప్పియుండు ప్రతివచనము ఎట్లు ప్రతివచనమగును అనుటయు మాకు బోధపడలేదు. ఒకవేళ అనుమాననిరసనమనుటచే శ్రీశ్రుతప్రకాశికాచార్యులు, శ్రుత్యర్థోపపాదక తర్కనిరసనమునో, శ్రుతివాక్యములసమన్వయమునకుపయుక్తమైన తర్కముయొక్క నిరాసమునో వివక్షించుచున్నారని అభిప్రాయముతో ఈప్రతివచనము చెప్పఁబడియున్నదో అనిన, అటువంటి అభిప్రాయము సంభవింపనేరదనియే మేము సమ్మోదము. న్యాయవిచారసాంద్రమైన శ్రీశ్రుతప్రకాశికాచార్యుల గ్రంథము అటువంటి అభిప్రాయమునకెట్టు చోటిచ్చును. "వేదాంతవాక్యకుసుమ గ్రథనార్థత్వాత్సూత్రాణాం" అను మొదలైన శ్రీశంకరాచార్య వాక్యముల సంగ్రహము, ఏమి ప్రయోజనము నుద్దేశించి చేయఁబడుచున్నదనుట మాకు తెలియలేదు.

రెండవది "నిమిత్తమాత్రేశ్వరాగమస్య శ్రుతివిరుద్ధత్వాద్విరోధాధికరణన్యాయేనతత్ప్రతిక్షేపసిద్ధిరితిచేత్, తర్హి పాంచరాత్రస్యాప్యపరీక్ష్యత్వంస్యాత్" (శ్రుతివిరుద్ధములగు ఆగమములు పూర్వమీమాంసలో కానంబడు విరోధాధికరణన్యాయముచేత దూషింపఁబడునవుడు మరల నిచ్చట ఆయాగమ నిరాకరణము పునరుక్తముకాదాయనిన, అప్పుడు పాంచరాత్రాగమ విచారమును ఇచ్చట అప్రాప్తము కావలయుకదా?) అని శ్రుతప్రకాశికాచార్యుల ఆక్షేపమునకు ఏవిధపరిహారమునుం జెప్పక శ్రీశాస్త్రిలు దానిని అనాదరించి ప్రకృతమునకు సంబంధములేని మఱియొక అంశములో అద్వైతులుచేసిన ఒకవిధమైన దోషప్రకటనము చేయుచు ఆదోషప్రకటనముచే సమాధానము పొందుచున్నారు. ఇది ప్రత్యుత్తరమగునా?

వారు చెప్పెడు దోషమేమన, శ్రుతివిరుద్ధమైన ఆగమము పూర్వమీమాంసలో విరోధాధికరణన్యాయముచేత నిరాకరింపఁబడుచున్నదని శ్రీశ్రుతప్రకాశికాచార్యులు గ్రహించియుండునట్లు తెలిసెడు. అది అబసంద్ధము; ఏలయన, పూర్వమీమాంసలో శ్రుతివిరుద్ధములైన ఆగమాదుల ప్రామాణ్యము విరోధాధికరణముచేత

నిరాకరింపఁబడలేదు ; విరోధాధికరణము శ్రుతులకు విరుద్ధమై శ్రుతిసంబంధము లైన శాస్త్రముల ప్రామాణ్యమును మాత్రమే నిరసించుచున్నది. శ్రుతిసంబంధము లేని వేఱుశాస్త్రములు శ్రుతివిరుద్ధముగ నుడినయెడ వాని ప్రామాణ్యము శిష్టాకోపాధికరణమను అధికరణాంతరముచేతనే నిరాకరింపఁబడుచున్నది. కావున శ్రీ శ్రుతప్రకాశికాచార్యులు ఇచ్చట తప్పిపోయిరి, అనుటయే. దీనితత్త్వమును తెలిసికొన పూర్వమీమాంసలో చూపబడు విరోధాధికరణమేమి యనుటను మొదట నెఱుంగవలయు. వస్తుతత్త్వమును ఎఱిగించువిషయములో, స్మృతులను చెప్పఁబడు గ్రంథములకు పరస్పరవిరోధము కనంబడిన ఏది ప్రమాణమగును? అను సందేహము పొడమునపుడు రెండును ప్రమాణమని చెప్పుట అసంగతము గనుక, శ్రుతికి విరుద్ధముకానట్టి స్మృతియే ప్రమాణము. శ్రుతికి విరుద్ధమైనది ప్రమాణము కానేరదు.' అనునదియే విరోధాధికరణన్యాయము. 'స్మృతులన్నియు శ్రుతిని మూలముగ కలవి ' అనుట మన మతముగనున్నను, ఏయేస్మృతులలో శ్రుతివిరోధము కనఁబడుచున్నదో ఆయాస్మృతులు మనకు గ్రాహ్యములు కావు; అనుటయే యిచ్చట చెప్పఁబడినదగుచున్నది. " విరోధేత్వనపేక్షం స్యా దసతిహ్యనుమానం " అనిసూత్రము. దీనిఅర్థము:—విరోధే—క్లృప్తమైన ప్రత్యక్షశ్రుతికి విరోధము సంభవించునెడ, అనపేక్షంస్యాత్—అట్లు విరోధించు స్మృతియొక్క ప్రామాణ్యము అనపేక్షమగును. (అనగా—హేయమగును) (ఏలయన) అసతి—అట్టి విరోధము లేకున్నప్పుడుగదా, అనుమానం—శ్రుత్యనుమానము ఏర్పడు, అదేమనఁగా—' శ్రుతిని మూలముగ కలిగియుండుటయే స్మృతులకు ప్రామాణ్యహేతువు. ఆశ్రుతిమూలత్వము ఏస్మృతులకు ప్రత్యక్షముగ క్లృప్తమైయుండును. ఆస్మృతులకు శ్రుతివిరోధములేదు కావున అవి యెప్పుడు ప్రమాణమే., ఇంక కొన్నిస్మృతులకు శ్రుతిమూలత్వము ప్రత్యక్షముగ తెలియదు. ఆస్మృతులును మహర్షి ప్రణీతములై యుండుటవలన, వానికిని శ్రుతిమూలకత్వమును అనుమానముచే నూహించి ప్రామాణ్యమును కల్పించెదము. కాని, ఆస్మృతులలో వేదవిరుద్ధమైన యంశము ఏదైన పొడగట్టినచో వానికి శ్రుతిమూలత్వమును అనుమానించుట అసంగతము ; గనుక అవిత్యజింపఁదగినవే, అని చెప్పినట్లయ్యె. విరోధాధి కరణముయొక్క విషయమీతీరున నుండునప్పుడు శ్రుతివిరుద్ధములైన ఆగమముల ప్రామాణ్యము ఈయధికరణ న్యాయముచే నిరాకరింపఁబడుచున్నదని చెప్పుటలో నేమిదోషము సంభవింపఁగలదు. ' స్మృతి ' అని చెప్పియుండుటవలన, వేదోపబృంహణ (వేదార్థములను విశదముగాఁ జెప్పు)ములుగానున్న స్మృతులే యిచ్చట చెప్పఁదలచినవి అని చెప్పుట సాధ్యముకాదు ; వానికి వేదవిరోధము సంభవింపదుగదా? అందుచే, వేదోపబృంహణములుగా లేక పరమర్షిప్రణీతములైన తంత్రములును వాని ననుసరించియున్న మిగత స్మృతులే యిచ్చట స్మృతిశబ్దముచే చెప్పఁదలచినవి. సాంఖ్యము మొదలగు స్మృతులను

స్మృతులని మనము వ్యవహరించుచున్నారముగదా? శ్రీశంకరాచార్యులు స్మృత్యధికరణభాష్యమున 'సాంఖ్యస్మృతికి విరోధమువచ్చుట వలన బ్రహ్మవాదముత్యజింపఁదగినదికాదా?' అనుశంకను పరిహరించు ప్రకరణములో ఈవిరోధాధికరణమును ప్రస్తావించియున్నారు. "విప్రతిపత్తౌచస్మృతీనా మన్యతరపరిగ్రహేఽ న్యతరస్య పరిత్యాగేచ శ్రుత్యను సారిణ్యఃస్మృతయః ప్రమాణమనపేక్ష్యాఇతరాః. తదుక్తం ప్రమాణలక్షణే 'విరోధేత్వనపేక్షంస్యా దసతిహ్యనుమానం' ఇతి" (స్మృతులకు పరస్పరవిరోధము వచ్చిన వేదవిరుద్ధస్మృతులను పరిత్యజించి వేదవిరోధము లేని వానిని పరిగ్రహింపవలయును. పూర్వ మీమాంసలో ప్రమాణలక్షణమున (1 అధ్యాయమున) ఆలాగు నిర్ణయింపఁబడియున్నది) అనునది శ్రీ శంకరాచార్యులవాక్యము. ఇట్లు వేదవిరుద్ధమైన సాంఖ్యాది తంత్రమును అప్రమాణమని నిరాకరింప విరోధాధికరణము ప్రవర్తించినపుడు వేదవిరుద్ధమైన శైవాగమము మొదలైన వానిని ప్రతిక్షేపము సేయ అదియేల ప్రవర్తింపఁజాలదు. స్మృతులలో పరస్పర విప్రతిపత్తి సంభవించుట ఒకవిషయము, స్మృతులకును శ్రుతికిని విరోధము సంభవించుట మఱియొక విషయము' ఈరెండు విషయములలోను శ్రుతివిరోధమే అప్రామాణ్యమునకు హేతువగుటవలన, ప్రకృతవిచారమును అదియేవిధముచేతను బాధింపఁజాలదు. మఱియు, శిష్టాకోపాధికరణమునకు ప్రకృత విషయములో కొంచెమైన సంబంధములేదు. ఆయధికరణము 'ఒకస్మృతిలో ఒక్కచోట వేదవిరుద్ధమైన యంశము కనఁబడిన ఆయంశమునందు మాత్రము ఆస్మృతిక ప్రామాణ్యమును ఒప్పుకొని అవిరుద్ధములైన మిగిలిన యంశములందు దానికి ప్రామాణ్య మంగీకరింపవచ్చునా?' అనుటను విచారించుచున్నది. కావున ప్రకృతవిషయములో అది ప్రవర్తింప నేరదు. వస్తుస్థితి యిట్లుండ శ్రీశాస్త్రిలు ఏవిధమున దీనిని దూషించుచున్నారనుట మాకు బోధపడలేదు.

శ్రీ శ్రుతప్రకాశికాచార్యులు చేసిన యాక్షేపము మీకును సమానమనిన, దానికి మేము విరోధాధికరణన్యాయముచే వేదవిరుద్ధమైన ఆగమముయొక్క అనాదరణీయత్వము సిద్ధమైయున్నను, పశుపతి మతముయొక్క వేదవిరుద్ధత్వమును స్పష్టముగ జ్ఞాపనము చేయఁదలచియే 'పత్యురసామంజస్యాత్' అని మరల ప్రారంభింపఁబడుచున్నది, అని సమాధానము చెప్పుచున్నారము. విరోధాధికరణము ప్రవర్తింపనీ ప్రవర్తింపకపోనీ వేఱొక అధికరణము ఈ విషయమున ప్రవర్తించుచున్నది అని సమ్మతించు శ్రీశాస్త్రులు, ఈ పాదములో పాంచరాత్రముయొక్క పర్యాలోచనమెట్లు ప్రాప్తించును అనుటకు సమాధానము చెప్పవలసిన వారుగానున్నారు. దానిని వారు చెప్పునంతదనుక, వారు చెప్పునట్లు ఆరంభించిన ప్రతివచనము అసంపూర్ణముగానే నిలుచును. విస్తరభయముచే మేమింతటితో చాలించుకొనియెదము.

శ్రీః

# శ్రీ వైష్ణవసిద్ధాంతసభ, చెన్నపురి.

పోషకులు:—శ్రీ ఉభయ, రావుసాహెబు డి. శ్రీనివాసయ్యంగారు. ఢిల్లీ.

సభాధ్యక్షులు:-శ్రీ ఉభయ హైకోర్టు జడ్జి వి. వి. శ్రీనివాసయ్యంగారు బి. ఎ; బి.యల్. మద్రాసు.

కార్యదర్శులు.

౧. శ్రీ ఉభయ యస్. గోపాలస్వామి అయ్యంగారు. బి. ఎ; బి. యల్. మైలాపూరు.

౨. ,, యస్. లక్ష్మీనరసింహాచార్యులుగారు. తిరువల్లిక్కేణి.

శ్రీ వేదాంతదీపికా కార్యస్థానమున వెలకు దొరకు గ్రంథములు:—

౧. శ్రీస్తోత్రరత్నము. శ్రీయామునాచార్యకృతము. శ్రీపెరివాచ్చాన్పిళ్లై అనుగ్రహించినది. ,, అఱవవ్యాఖ్యానముతోడ. రూ. ౦ ౧౦ ౦

౨. శ్రీసచ్చరిత్రరక్ష. శ్రీనిగమాంతమహాదేశిక కృతము అఱవ తర్జుమాతోడ. ,, ౦ ౧౪ ౦

౩. శ్రీపరమపదసోపానము: డిటో అఱవమునందు ,, వ్యాఖ్యానముతోడ కలది ,, ౦ ౮ ౦

౪. శ్రీనమ్మాళ్వారువైభవము ,, ౦ ౪ ౦

---

శ్రీః

# వేదాంతదీపిక.



(హిందూమతసంబంధమగు నాంధ్రమాసికపత్రిక.)

సంవత్సరము చందా రూ. లు. ౩ ౦ ౦

వలయువారలు ఈక్రిందఁ దెలుపఁబడినవారికి వ్రాసి పడయవచ్చును.

కార్యదర్శి.

శ్రీవైష్ణవసిద్ధాంత సభ తిరువల్లిక్కేణి, మదరాసు.

సంపాదకులు.

శ్రీ వంగీపురము వాసుదేవాచార్యులు. బి. ఎ; యల్. టి.

## పత్రికయొక్క ముఖ్యోద్దేశ్యములు.

(౧) ఉపనిషత్తులలోను, బ్రహ్మసూత్రము, భగవద్గీత, మున్నగుగ్రంథములలోను, పూర్వాచార్యు లనుగ్రహించి యున్నశ్రీసూక్తులలోను, వివరింపబడి యుండువిశిష్టాద్వైత మతసిద్ధాంత తత్త్వములు తెలియఁ జేయబడుట.

౨. దైవభక్తి, సదాచారము మున్నగు సద్గుణములు తెలియు జేయుపురాణకథలు వ్రాసి ప్రకటించుట.

౩. భగవంతునిస్తోత్రములు, అపూర్వగ్రంథములు, ఇంతదనుక నచ్చు లో లేనిపక్షమున పూర్వాచార్యులు చేసియున్న వ్యాఖ్యానము ననుసరించి యాంధ్రభాషావ్యాఖ్యానముతోడ యథావకాశముగాఁ దెలియఁజేయుట.

పైనఁ జెప్పఁబడిన యుద్దేశ్యములంగూర్చి వ్రాసి యీవేదాంతదీపికలోఁ బ్రకటింపఁ గోరిన మహనీయు లెల్లరు సంగ్రహముగాను, కుతూహలమైనవిగాను, మంచువ్యాసములు వ్రాసి, వేదాంతదీపికా సంపాదకులు, కోట్నిస్ గార్డన్స్, మాంబళము, సైదాపేట. అని వ్రాసి పంపఁ బ్రార్థితులు.

వెల స్వల్పము! ఫల మధికము!!

# అమృతాంజనము.

## అన్ని నొప్పులకు పరమామృతము.

వనమూలికలచే హిందూదేశమునందు
తయారుచేయబడిన మందు.

అమృతాంజనము
అనేకులచే
యోగ్యతాపత్రములు
పొందినది.
వారమునకు
వేలకువేలు సీసాలు
విక్రయము.




పంచభాషల చీటిని
చూచి కొనిన
మోసముగలుగదు.
అమృతాంజనము
అన్ని చోట్లలోను
దొరకును.

తలనొప్పుల మాన్పును, వాపుల రూపుమాపును, మరదను
తొలగించును, బెణుకుల ఛేదించును, తేలుబాధల
తీసివేయును, పడిసెముల పారదోలును, ఎమిడికల
వెడలగొట్టును, వాయువుపోట్లను బాపును, దగ్గును
తగ్గించును, గాయములను మాన్పును
నకలుమందులకు మోసపోకుడు
డబ్బీకి యిరుప్రక్కలయుండు పంచభాష చీటీని
చూచి కొనిన మోసముకలుగదు.

## అమృతాంజనము డిపో.,

బొంబాయి. *** మద్రాసు.

Printed at the Model Press, Rattan Bazaar Row, P. T., MADRAS.